# నిర్మాణ కార్యక్రమము

మహాత్మా గాంధి

రాజేంద్రప్రసాద్



దేశప్రచార [illegible]

# నిర్మాణ కార్యక్రమము

[దాని విశిష్టత కొన్ని సూచనలు]


మహాత్మా గాంధీ

రాజేంద్ర ప్రసాద్

అనువాదకర్తలు

కా. శఠకోపాచార్యులు



దేశికవితా మండలి

ఘంటశాల :: బెజవాడ.

# అనువాదకుని మనవి

మన భారతజాతి యుద్ధరణకు సాధకమై అందరూ ఆచరించదగు వివిధాంశాల ప్రణాళికను గాంధిమహాత్ముడేర్పరచెను. దానిని మన జాతీయ సంస్థయగు కాంగ్రెసు ఆమోదించినది. ఇదే 'నిర్మాణ కార్యక్రమం. ఇది మన జీవితరంగములన్నిటిలోని లోపములను పోగొట్టి జాతికి పునర్నిర్మాణం కల్గించునది దీనిని అన్నిపక్షాలవారు, నిష్పక్షియులును, అమలు జరుపదగును. దీని ఆవశ్యకతను గ్రహించకయే చాలమంది దీనికి ఉదాసీనంగా వున్నారు. నిజమునకు, స్వరాజ్యసౌధమునకు నిర్మాణకార్యక్రమమే సోపానము. కొందరిందులో కొన్ని అంశాలనే ఆచరించుచు అస్పృశ్యతా నివారణవంటి కొన్నిటికి విముఖులగుటయుం కలదు, కనుక విశుద్ధమగు జాతీయోన్నతికీ యంశములన్నిటి ప్రాముఖ్యమును బోధించుచు గాంధిమహాత్ముడును ఆచరణ విధానములు సూచించుచు డా॥ రాజేంద్రప్రసాదు సూత్రప్రాయమగు పొత్తముల వ్రాసినారు. వాటిని నవజీవన కార్యాలయంవారు ప్రచురించినారు. ఈ మహనీయుల, జీవితము గూర్చి విశేషంగా చెప్పనక్కరలేదు. గాంధిమహాత్ముడు కాతియవాడులో 1869 సం॥లో జనించి, బారిష్టరుఅయి దక్షిణాఫ్రికాలో భారతీయుల నుద్ధరించి, 1919 నుండి మనజాతీయ నాయకుడై జాతీయోన్నతి కనేక సంస్థల స్థాపించి, సత్యాగ్రహ ప్రవర్తకుడై అహింసా సత్యముల పోషణ ద్వారా దైవీప్రకృతిని పునరుద్ధరించుచు, రక్తపాతపూరితమై విషాక్తమై తల్లడిల్లు మానవజాతిని విశ్వప్రేమ సంజీవనితో పునరుజ్జీవింపజేయ తనజీవిత మర్పించుచు, అజ్ఞానాంధకారమునుండి లోకులను జ్ఞానదీపికతో విముక్తుల జేయబూనిన మార్గదర్శి, ఆయన ప్రక్రియ మన దేశాభ్యుదయమునకే కాక, లోకకల్యాణమునకును సాధకము.

ఆయన ముఖ్యసహచరుడగు డా॥ రాజేంద్రప్రసాదు బీహారులో 1884 సం॥లో పుట్టి, ఎం. ఏ., ఎం. ఎల్. వరకు అన్ని పరీక్షలలో ప్రథముడై, న్యాయవాది ప్రముఖుడై, పాట్నా విశ్వవిద్యాలయపు సిండికేటులో ముఖ్య సభ్యుడై, 1917 సం॥లోని చంపారీను సత్యాగ్రహంలో గాంధిగారికి కుడిభుజమై మహాత్యాగియై ప్రజానాయకుడైన 'దేశరత్నము' ఆయన 25 ఏండ్ల

# II

నుండి కాంగ్రెసు కార్యసమితి సభ్యుడై 1934 సాలుకును మరల తాత్కా
లికంగా 1939 లోను కాంగ్రెసు మహాసభకు అధ్యక్షుడై జాతీయ ప్రచారం
చేసినారు. రెండు సారులు హిందీసాహిత్య సమ్మేళనమున కధ్యక్షుడైనాడు.
ఇప్పుడు భారతేతిహాస మండలి కధ్యక్షుడు. ఆయన సామ్యత, సాధుత్వం,
విజ్ఞానం, నిర్మాణ కార్యచతురత, అపారమైనవి. గాంధి మహాత్ముని సదరు
రచనను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం వారును, రాజేంద్రప్రసాదు రచ
నను నేనును విడిగా తెలుగులో 1942 సం॥లో ప్రచురించుట జరిగినది
అయితే, ఈ రెండును పరస్పరం సహాయక పూరకములు; రెంటి విష
యాలను ఒకే పుస్తకంలో మేళవింపదగునని యెంచి ఈ పునర్ముద్రణలో
అట్లుచేసినాను. పునరుక్తి లేకుండుట కవసరమైన చోట్ల దించినాను కాని.
విషయముల నేటినీ విడువలేదు ఇందలి ఉత్తమ పురుష వాక్యములన్నియు
గాంధిమహాత్మునివి. కొద్దిగ అక్కడక్కడ పాదటిప్పణులు స్వయంగా చేర్చి
నాను. కనుక అందలి భావములు బాధ్యత నాదే. ఆంధ్రప్రాంత మంతటిలో
నిర్మాణ కార్యక్రమమందు శ్రద్ధ హెచ్చుటకీ ప్రచురణ కొంచమైన ఉపక
రించిన; ఈ యనువాదము సఫలమగును

— కో. శఠకోపం.

# 1. ఆరంభం

'నిర్మాణ కార్యక్రమం' అనగా అహింసా సత్యములద్వారా పూర్ణ స్వరాజ్యం నిర్మించుట అన్నమాట హింసాపద్ధతితో బాటు అసత్యతతప్పదు. వాటి ద్వారా స్వరాజ్యసాధనలో కలుగు బాధలు తెలిసినవే. ఈ మహా యుద్ధంలో ధన ప్రాణాలతో బాటు సత్యపరత యెట్లు నష్టమైనదో చూడుడు. అహింసా సత్యాలద్వారా యేర్పడు పూర్ణస్వరాజ్యములో ప్రతి చిన్నవారికీ అన్ని జాతిమతాలవారికి స్వాతంత్ర్య మేర్పడును. ఇది విభేద మునకు బదులు అన్యోన్యత కల్గించేది. ఆచరణలో కొంత లోపముండును. గణితశాస్త్రం యూక్లిడు నిర్వచించిన గీతకు మనము గీసేగీతకు భేదమున్నట్లే ఈ ప్రక్రియ పూర్తిగా క్రియలో సాగించితేనే స్వాతంత్ర్యము సంపూర్ణ మగును. ఈ కార్యక్రమములు పరిశీలించి, దీక్షతో పూర్తిగా సాగించితే మనము కోరేస్వరాజ్యము సిద్ధించి తీరును. సాంఘికైక్య మేర్పడగానే రెండు ముఖ్యపక్షాలూ సిద్ధపర్చే ప్రణాళిక నాదరిస్తామని అమెరీ గార న్నారు గదా. *ఇందుకాయనను శంకించనక్కర్లేదు. శాంతంతో మనమూ సాంఘికమైత్రి సంపాదిస్తే, అది అమోఘమగును. మన్నించక తప్పదు. అట్టి పూర్ణస్వరాజ్యము హింసాపద్ధతిద్వారా ఎప్పుడూ లభించదు. హింసద్వారా అధికారమొందు పక్షము దేశంలో ప్రబలమగును. అందులో ఆర్థిక సమ త్వమూ మరియే సమత్వమూ ఉండదు. ఈ వాదమును మీరొప్పుకోక పోయినాసరే నిర్మాణ కార్యక్రమము జనులకు క్షేమకరమనే సత్యమే ఇప్పుడు మనకు కావలసినది. ఈ 13† అంశాల కార్యక్రమపు సూత్రం ఆచరణ గూర్చి కార్యకర్తలకు సహాయముక్రింద కొన్నిసూచనలు చేయబడును.

---

* అప్పటికింకా అమెరీ భారతమంత్రి చర్చిలు మండలి బ్రిటిషుమంత్రి వర్గంగాను వుండిరి.

† ఆదిమవాసుల ఉద్ధరణ, కార్మిక కర్షక విద్యార్థి వర్గముల వృద్ధిని గూర్చియు, ఈ రెండు కొత్త అంశాలుచేర్చినా 15 శాఖలయినవి.

# 2. సాంఘిక ఐక్యం.

సాంఘికంగా ఐక్యమేర్పడుట అవసరం అయితే, అది రాజకీయం నిమిత్తం కృత్రిమమైనది కాక మనసార ఏర్పడవలె. ప్రతి కాంగ్రెసువాదీ ఏమతస్థుడైనను అన్యమతస్థులతో సమభావం మైత్రిగల్గి వారి మతంపైన కూడ గౌరవము వుంచవలె

అట్టి సుఖస్థితి యేర్పడితే, స్టేషనులలో హిందూ ముస్లింములకు వేర్వేరుగా నీరు టీ ఇట్లే వేర్వేరు స్కూళ్లు, ఆసుపత్రులు ఏర్పరచుట ఇట్టిసిగ్గు చేటు పద్ధతులుండవు. ఈ ఐక్యపు సత్కార్యము క్రాంతికరమైనది దీనిని ధార్మికంగానే సాగించండి, అందుండి సహజంగా రాజకీయఫలమూ కలుగును శాసనసభలద్వారానే ప్రాధనమేర్పడునను చిరభావన వట్టి భ్రమ. కొందరు బ్రిటిషు చరిత్ర అరగారగాచదివి, పార్లమెంటే ప్రజాశక్తి కాధారమని పొరబడుదురు. అసలు శక్తి ప్రజలదే అది యెన్నికలద్వారా ప్రతినిధి సభ్యులకు సంక్రమించును. అసలు ప్రజాశక్తి బలంగా లేకుంటే ఆ శాసన సభయు వ్యర్థం. ఈ సత్యమును ఈ 20 ఏండ్లనుండి బోధించు చుంటిని. శాంతధిక్కారం అనే సత్యాగ్రహమే ప్రజాశక్తిని బలపరచును. ప్రజలు రాజశాసనం ధిక్కరించి అందుచేగల్గు బాధలకు సిద్ధపడితే, ప్రభుత్వకార్య వర్గమంతా స్తంభించును. పోలీసులు సైనికులు (ఎంతబలీయులైనా) కొద్దిమందినే అణచగలరు. బాధలకు సహించె ప్రజాసామాన్యపు నిశ్చయమును పోగొట్టలేరు. జనులు మెజారిటీ (హెచ్చుమంది) అభిప్రాయము కంగీకరించు పద్ధతి యుంటేనే శాసనసభయు సవ్యంగా పనిచేయును. సహృదయులకే సభాపద్ధతి ఇప్పుడు మన దేశంలో మతమును బట్టి ప్రత్యేక నియోజకవర్గాల ద్వారానే ఎన్నికలు పెట్టి నందున ఆ శాసనసభలలో కుల మత, విభేదాలు ఏర్పడినవి

ఇట్టి సభ్యులు సమావేశాలులోను కలహించి, పరపాలకు లిప్పించే పదవుల పంపకంనిమిత్తం పరస్పరం పెనగులాడుదురు, ఈ పాలకులలో, ఈ రెండు కక్షలను అదిమియుంచి, వారు తమలోతమ్ము మర్దించు కోకుండా వారిని రక్షింతురు. ఇట్టి అసహ్యపద్ధతి ద్వారానే స్వరాజ్యము లభించుట కలలోనివార్త కాని—

దేశశుభచింతకులు కానివారు శాసనసభలలో ప్రవేశించకుండా ఉండే నిమిత్తం కాంగ్రెసు సంస్థ తన అభ్యర్థులను నిలువబెట్టవలసిదే నని నా అభిప్రాయం.

— గాంధీజీ.

ఇప్పుడు మనదేశంలో అయాసంఘాలమధ్య విభేదాలు, పరస్పరం, అపనమ్మకం, వల్ల అనుమానం ఏర్పడి, మన జాతీయజీవితమంతయు చెడినది. మతకార్యాలు, భాష, సంస్కృతి, జీవితపద్ధతి, విద్య, ఆర్థికస్వాతంత్ర్యం రాజకీయస్వత్వము, ఇట్టి అన్నిటిలో పరస్పరం సద్భావమును శంకించు చున్నారు.

మనకుండే హక్కులు కాపాడుకోవచ్చు: ప్రత్యర్థుల హక్కులు వారు దురుపయోగపర్చకుండా ఆపవచ్చు; కాని అందు కెంతమాత్రమూ దౌర్జన్యం చేయకూడదు.

తరుచు సాంఘికకలహాలు ఏర్పడు సన్నివేశములు క్రింద ఉదాహృతములు. వాటివల్ల అహింసతో వర్తించు టెట్లో తెలియును.

(క) యాగములో అహారములో ఒక ముస్లిము గోవును చంపబోవుచు, ‡ అప్పు డాచర్యను మాన్పించ, హిందువులతనితో స్నేహంతో వాదించి, హిందువుల మనస్సు నొప్పింపవద్దని బోధించవచ్చు; కాని గోవధ తప్పించుట కని కూలీలు, దౌర్జన్యం ఎంతమాత్రమూ చేయకూడదు.

(ఖ) ఇట్లే మసీదుముందర దేవవిగ్రహాలు మేళతాళాలతో హిందువులు తీసుకువెళ్ళినా, అప్పుడు ముస్లిముల ప్రార్థనకు శాంతంచెడినా దౌర్జన్యం చేయకూడదు. శాంతంగా వాదించి హిందువులను ఒప్పించవచ్చును.

(గ) హిందువులు ముస్లిములు తమతమ స్థలంలో, గుడినో మసీదునో కట్టుకొంటే, అందు కితరులడ్డకూడదు.

(ఘ) ఒకమతస్థుల ఉత్సవాలవల్ల తాత్కాలికంగా ఇబ్బందికల్గినా, రెండవమతభువారు ఓర్చుకోవలె.

---

‡ ముస్లింమతంలోను కొన్ని బక్రీదు మున్నగు విశిష్టదినాలలో జంతువును యాగంచేయు ప్రక్రియ యున్నది.

(ఙ) తమమతం అందరికీ బోధించి ప్రచారంచేయుట అన్నిమతాల వారిహక్కు. అట్లని, ఇతరమతాలను వాటి ప్రవక్తలను భక్తులను దూషించి, ఆమతస్థుల మనస్సు నొప్పించుట తప్పు.

(చ) ఎవరినైన మతం మార్పించడంలో, ఆ రెండుమతస్థుల మధ్య ఉద్రేకము కలతలు కల్గుచున్నవి; ఇందుకు తావీయ కూడదు.

(ఛ) ఏమతస్థుడైన పిల్లలను ఆడవారిని ఎత్తుకపోతే, తాము ఆదుష్టుని బట్టి శిక్షింపజేయుటే తమ గౌరవమని ఆమతస్థు లెంచవలె.

(జ) హింస గల్గించే పరిస్థితు లిట్టివేరావచ్చు. అప్పుడును హింసించ కూడదు. స్నేహరూపంగా బోధించి అది వ్యర్థమైతే, ఉభయుల కిష్టులగు మధ్యవర్తి నేర్పర్చి, ఆ తగాదాలు పరిష్కరించుకోవలె. ఒకపక్షంవారు పంచాయితీకిని ఒప్పుకోకపోతే, రెండవవారు ప్రత్యర్థులకు కనికరం పశ్చాత్తాపం కల్గునట్లు సౌమ్యంగానే నిరోధించి, బాధలు సహించి, శాంతంగా ఆత్మత్యాగము చూపవలెను. తమ వాదం కేవలన్యాయమూ, తాము ధీరులూ అయితేనే ఇది సాధ్యము. అహింసాయుతంగా పోరసాధ్యం కానప్పుడు న్యాయస్థానాలవంటి అధికారులద్వారాను పరిహారంపొందవచ్చును. అన్ని మతాలవారికి ఇదేసూత్రము.

(ఝ) ఒకసంఘపు సంస్కృతిని మరొకరు దూషించుటవల్లను కలత లేర్పడుచున్నవి. ఇందువల్ల దొమ్మిలేకపోయినా వైషమ్యము వ్యాపించును. ఒకప్పుడు హెచ్చుసంఘంవారు అల్పసంఖ్యాకుల వొత్తిడిచేయుదురు; ఒక ప్పుడు చిన్నసంఘంవారే ధనాఢ్యులో బలీయులో అయి, లేక పిరికియగు యెదుటివారిని లోకువచేసియు, అన్యాయాధికారం చెలాయింతురు. ఇట్టి పరిస్థితులలోను యెదుటివారి సందేహానుమానాలు పోవునట్లు ఆత్మార్పణం త్యాగం చేయ సిద్ధపడుడు. ఎవరిసంస్కృతికీ ప్రమాదంలేదనీ, అందరు తమ యిష్టానుసారం సవ్యంగా జీవించవచ్చునని తోపించి, అందరికి స్థిమితం కల్గింపుడు. ఉ॥ భాష, పిల్లల చదువు, జీవితచర్యలు, ఇట్టివాటిలో ప్రతివారికి పూర్ణస్వేచ్ఛయుండవలె వృత్తి వర్తకం విషయంలోను అక్రమపుపోటీ అన్యాయాధోరణీ ఉండకూడదు.

(ఞ) ఏవ్యాపారమూ వృత్తీ ఒకేసంఘంవారి ప్రత్యేకపు హక్కుకాదు. ఎవరికిష్టమగు వృత్తి వ్యాపారాలు వారు చేసుకోనీండు, ఒక పెద్దసంస్థలోనో

కార్ఖానాలోనో యజమాని స్వజాతీయులను పెట్టుకొన్నను, అందుకు తగువు పడకూడదు.

(ట) పరస్పరం అవిశ్వాసమూ అనుమానమూ తరుచు రాజకీయరంగంలోనే వచ్చుచున్నవి. ప్రతిసంఘంవారు ఇతర సంఘాలమీద ఆధిపత్యం చెలాయించుట కాశింపకూడదు. మన దేశంలో ఎన్నియో [illegible]లాలు సంఘాలునున్నవి. ఇందొక కక్షవారు సర్వాధికారం వహించబూనితే, ఇక దేశంలో శాంతి సౌఖ్యాలుండవు. ఒకసంఘంవారు ఇతరసంఘాలవారి కుపకారంచేయుటకే యత్నించవలె. న్యాయంతోబాటు ఔదార్యమునుండవలె. అనుమానం కల. తలు పోగొట్టుటకు ఔదార్యము మంచిమందు. పిరికితనము భయము నుండకూడదు. ఇప్పుడున్న భేదాలు పోగొట్టుటకు రాజకీయపక్షాలు రాజకీయ సాధనాల వేర్పరుస్తవి. అవిగాక, తీవ్రపరిస్థితుల మధ్యగూడ సంఘసేవకులు శాంతము సహనము చూపితే, చాల లాభముండును. ప్రతివారు అన్య మతస్థునితో ఒక్కనితోనైన గాఢమైత్రి సంపాదించవలె. ఇట్టి ప్రేమాంకురాలే వృద్ధియై, సాంఘికమైత్రి బాగా ఫలించును. 'ఇతరులలో పాలెంచకు' ఇది స్వర్ణసూత్రము. ఆత్మపరీక్ష అంతః పరిశీలనచేసి, తమలోట్లు గ్రహించుటే ప్రతివారికి మంచిది. కనుక సాంఘికకలహాలు చెలరేగినప్పుడు తమలోపాలు తమ సంఘపులోపాలు స్వసంఘీయులు విమర్శించవలెను. ఎదుటి సంఘపుస్థితిని వారికే వదలుడు. దురుసుమాటలు, పొరపాటువార్తలు, దురుద్దేశ మారోపించుట, ప్రతిక్రియాచర్యలు సాగితే, దోషాలు హెచ్చి, మరల మైత్రిగల్గుట కాటంకము హెచ్చును. సత్యమును మరుగుపర్చకూడదు, నిజమే కాని పరస్పర ఖండనలు గల సంవాదాలవల్ల కలత లణుగుటకు బదులు పెరుగును.

అవసరమైతే తమ ప్రాణాలొడ్డుటకైన సిద్ధమయే అహింసాత్మకులను జట్లుగ నేర్పర్చి శాంతిదళపు తరఫీదు చేయుటచాల మంచిది. ఇది ఒకసంఘం వారు ఇతర సంఘాలమధ్యవారికి సేవచేయవలె. ఇట్టిది దౌర్జన్యాలు తప్పించుటకు, కలిగినవాటి నణగజేయుటకు నుపయోగించును.

(త) ప్రతి పట్టణంలోను గ్రామాల ఫిర్కాలోను ప్రజల విశ్వాసమైన ఆయా సంఘప్రముఖుల సమితుల నేర్పర్చుడు; వారు సాంఘికకలహాల కాజీగ పరిష్కారంకూడా చేయవచ్చు.

# 3. అస్పృశ్యతా నివారణ.

హరిజనులనంటకుండు పద్ధతి హిందూ జాతికంతకూ కళంకం, శాపం, దానిని పోగొట్టుటకు కొందరు కాంగ్రెసువారు కృషిచేసినారు. కాని రాజకీయకార్యపు దృష్టిలో ఆ భావనతప్పు, హిందూమతం భద్రంగానిల్చి యుండుటకే అస్పృశ్యతా నివారణ అవసరం. కనుక ఆ దృష్టితోనే యీ కార్యమును కాంగ్రెసు హిందువు లందరూ సాగించితే, అందువల్ల సనాతనులతో ఎక్కువ పరిణామ మేర్పడును; ఈ కార్యం స్నేహభావంతో జరిగించండి మన దేశంలో హరిజనులకున్నంత కేటాయింపు లోకంలో మరియేజాతికి లేదు. దానిని వెంటనే తొలగించుట హిందువులందరి ధర్మం. ఇది కష్టమనుకొన్నా స్వరాజ్యసౌధపు నిర్మాణంలో ఇది ముఖ్యభాగం - ముక్తి మార్గం - చాలా యిరుకుదే; అందులో నిమ్నోన్నతాలుదాట వలె ‡ అందులో మన అడుగు తప్పక సరిగా వేయుమంటేనే భద్రంగా శిఖరంచేరి స్వాతంత్ర్య వాయువు ననుభవింతుము.

— గాంధీజీ.

ఇది హిందువుల పాతసాంప్రదాయమే, కాని చాల నింద్యము. ఇది మతాచారమందురు, కాని నిజంగా అసత్యం ఇది క్రూరమగు దుష్టాచారము: సవర్ణులందరు వారినస్పృశ్యులుగ నెంచితే, వారిలోనే (మాలలు మాదిగలు ఇట్టి) ఒకశాఖవారింకొక శాఖ నస్పృశ్యులుగ నెంచుటబట్టి వ్యాధి యెంతలోతుకు దిగినదో చూడుడు, వానిమూలకారణము లేవైనను, హిందూమతమునజీవంగా ఉండవలెనంటే, ఈదురాచారం మొదలంట పెకలించి వేయవలె.

ఈ అస్పృశ్యతా పద్ధతి ఆయాప్రాంతాలలో ఒక్కొకరీతిగ నున్నది. నీచం మలినం అని సవర్ణులెంచువృత్తులే ఈ నిమ్నజాతులపాలబడినవి, సాధారణంగా వీరియిండ్లు వట్టి మట్టు గుడిసెలు; ఇవి సవర్ణుల యావాసమునకు వెలిగా, వేరుగనుండును. అక్కడి దేవాలయాలు, బడులు, నూతులు, చెరువులు, హోటల్లు ఇత్యాదులకు వీరిని రానీయరు. కనుక వీరు విద్యలో వెనుక

---

‡ క్షురస్యధారా, నిశితా, దురత్యయా, దుర్గం పథ స్తత్ కవయో వదంతి (ఈశావాస్యోపనిషత్తు)

బడి బీదలై తరుచు భూవసతి లేకయున్నారు. వీరికున్న బాధలు, కష్టాలు ఎట్టివో గమనిస్తే మనసంఘమునకున్న యీఘోరకళంకమును పోగొట్టుటె అవసరమో ముఖ్యమో స్పష్టమగును.

## అస్పృశ్యతలో రకాలు.

(క) కొన్నిప్రాంతాలలో సవర్ణులు స్నానంచేసిరయో భోజనవేళనో, గుడికి వెళ్లునప్పుడు, ఆదిహిందువు కంటబడితే చాలు, మైలుబడుదురట। తాను వచ్చుచున్నట్టి నిర్భాగ్య హరిజను డరచుచు బోవలెను; పూర్వం కుష్ఠరోగులట్లు చేయుచుండిరట.

(ఖ) హరిజనుడు కొన్ని వీధులలోనికి రాకూడదు, సవర్ణులకు నియమితదూరంలో ఉండవలె. వారితోబాటు బల్లమీద తివాచిమీద కూర్చొనివ్వరు ఇంట్లోకి వసారాలోనికి రాకూడదు. అత డేదిముట్టినను అంటే. వంటశాలదరి కనతేరాకూడదు. సవర్ణులు వాడేనూతినీరు తోడకూడదు, చెరువునూ ముట్టకూడదు, వారి క్షౌరమునకు మంగలిదొరకడు. కొన్నిప్రాంతాలలో యితరులవలె దుస్తులును, హరిజనస్త్రీలు నగలును పెట్టుకోకూడదట. వివాహ జనన మరణాలలో సవర్ణులుచేయు ఉత్సవములును వీరిని చేసుకోనివ్వరు.

(గ) కొన్ని ప్రాంతాలలో దేవాలయాలేగాక ఆ చుక్కవీధులకును రాకూడదు. సవర్ణులు స్నానంచేయు చెరువులలో నదులలోను వీరు స్నానం చేయకూడదట. వేదశాస్త్రాలు చదువరాదు. సవర్ణులు పురోహితులు వీరికి పౌరోహిత్యంచేయరు; పెండ్లి పుట్టుక చావులకు కర్మకాండ జరిగించరు.

## ఆచరణ సూచనలు.

(క) జాతీయసేవకుడు ముందుగ తనజీవితంలో అస్పృశ్యత మానవలె; జన్మ వృత్తిబట్టి ఘనుడు నీచుడు అను భావం వదులుకోవలె. హరిజనునితో బాటు ఒకేబల్ల పడక తివాచిపైన కూర్చొనుటకు ముట్టుటకు జంకకూడదు. ఒక హరిజనుని తనకుటుంబంలో నుంచుకోవలె. అతనిచేత గృహకృత్యములు చేయించినను సరే ఆహారం పానీయం పరిశుభ్రంగా ఉంటే, అస్పృశ్యభావ ముంచుకోకూడదు. అట్లని వారితో ఒకే పళ్లెంలో తినుమని కాదు; బంధువులు విషయంలోను అట్టి వివ్యాములుకూడదు. ఈ సంస్కర్తలను బంధుమిత్రులు నిరోధించవచ్చు; కాని అత డందుకు సహించవలె ద్వేషించకూడదు. ఆ సంస్కరణ కితరులను (తనకుటుంబం వారిగూడ) నిర్బంధించక,

నచ్చజెప్పి ఒప్పించుటయు, తన జీవితపు పవిత్రత సేవాశక్తి వల్లను, తనతో సంపర్కంగల వారి నాకర్షించి, సంస్కరింప యత్నించవలె.

(ఖ) గ్రామపు బావులు నూతులు, చెరువులు హరిజనులును వాడుకొనియవలెనని అస్పృశ్యత వదలినవారు తమతోటి వారికి బోధింపవలె మాల మాదిగల పిల్లల గూడ బడులలో చేర్చుకొండని బడియజమానులకు సవర్ణులకు నచ్చజెప్పుచు వారిబాధలన్నిటిని పోగొట్టుటకు తోడ్పడుడు. అన్నిటిలో దేవాలయ సమస్యయే చాల చిక్కయినది. కాని యీసంస్కరణలన్నిటి నిమిత్తం నిరంతరం ప్రచారంచేయుచుండవలె వీలయినప్పుడు చట్టములద్వారాను కోర్టుల ద్వారాను కార్యము సాధింపవచ్చు ఈబాధితనిమ్నజాతుల నిమిత్తం ఒకప్పుడు సత్యాగ్రహం కూడా జరిగింపవచ్చు

(గ) సవర్ణుల సంస్కరించుటే గాక, హరిజనులను బోధించి మార్చుటయు ముఖ్యమే. వారు తరతరాలుగా బాధపడు హీనుల మనుకొంటూ కొన్ని దురభ్యాసముల పాలైనారు. ఉ। శవాలమాంసం తినుట, ఇత్యాదుల పోగొట్టవలె. వారిలో వారు అంటరానితనం వదలునట్లు ప్రోద్బలం చేయవలె పాకీపని మర్యాద వృత్తియేకాని నీచంకాదని వారికిచూపించవలె; పరిశుభ్రతఆరోగ్యపద్ధతులు చాలమంచివి, అవసరమైనవి, అని నేర్పవలె. కార్యకర్తలు స్వయంగా దొడ్లుతుడిచి, అది మర్యాదపనియని, పాకీపనిచేయుచును శుభ్రగా ఉండవచ్చునని, కనపర్చవలె జనులు తరుచుదొడ్లు నెంతో అశ్రద్ధగా వాడుచు, కశ్మలపరుతురు; అందువల్ల పాకీపని కష్టమగుచున్నది దొడ్లను మురుగుకాల్వలను శుభ్రంగా వాడు పద్ధతులు ముఖ్యంగా కార్మికులకు బోధింపవలె వీలైనచోట్ల గోతులదొడ్లు పెట్టించి, అశుద్ధమును మట్టితో సరిగా కప్పేపద్ధతి జనులకు నేర్పవలె. ఆశ్రమవాసులు తమపాకీపని తామే నిర్వర్తించవలె. ఇందువల్ల పరోక్షంగా అయినను అస్పృశ్యతా భావం కొంత తొలగును సవర్ణులును తోళ్లు బాగుచేసి చర్మవస్తువులు చేయుచుంటే, హరిజనులాకార్యముల నెక్కువ చక్కగా శుభ్రంగా చేయప్రోత్సాహముకల్గును హరిజనులలో త్రాగుడు, జూదము వ్యాపించినవి; ఈరంగంలో పనిచేయుట కెంతో అవకాశమున్నది†

---

† దేవాలయసమస్య ముఖ్యంకాదని కొందరు కాంగ్రెసువాదులును తలంచుచున్నారు. దేవాలయాలు పామరుల కుద్దేశించినవి, పామరులలో పామరులగు హరిజనులను రానిస్తేనే అది నెరవేరును. హరిజనులకు నైతికంగా ఆధ్యాత్మికంగా ఉద్ధరణ దేవాలయప్రవేశంవల్ల జరుగును.

ఇట్టిదే కార్యపరులు దీక్షతో పనిచేయదగురంగ మింకొకటి కలదు. భారతదేశంలో ముఖ్యంగా మన్యంలో నివసించు ఆదిమవాసులనేకు లున్నారు. వారు మూఢులై, ఆర్థికంగాను వెనుకబడి, దుస్థితిలో నున్నారు. క్రైస్తవమిషనరీలు వారిలో విద్యాప్రచారం చేసినారు. కాని మన మింతవరకీ మన్యపుజనుల నశ్రద్ధచేసినాము. వారికి విద్యనేర్పి అన్నివిధముల నుద్ధరించ పెద్దయెత్తున పనిచేయవలె, హరిజనోద్యమపు పద్ధతులనే అవలంబించవచ్చు. †

ఇట్లు స్వయంగా అంటు వదలుట, సవర్ణులలో ప్రచారం చేయుట, హరిజనులలోనే సేవచేయించుట, ఈ మూడురీతులను ఈఅస్పృశ్యతాసమస్యను పరిష్కరించవలె.

(ఘ) రాజకీయరంగంలో హరిజనుల హక్కులనిక్కడ చర్చించలేదు. ఇతరులతోపాటు వారికీ హక్కు లీయవలసినదే.

(జ) హరిజనులకు వేరుగా నూతులు, బడుట వసతిగృహాలు స్థాపించు యత్నాలు జరుగుచున్నవి. ఇందువల్ల మైత్రి గల్గుటకు బదులు, వీరికి సవర్ణులకు మధ్య వేటాయింపు హెచ్చు అయితే హరిజనులు సమిష్టి అవకాశాలు లేక బొత్తిగా కష్టపడుచోట్లతాత్కాలసౌకర్యమునకు ఇట్టివాటి నేర్పరుపవచ్చు

# 4. మధ్యపాన నిషేధం.

త్రాగుడును మాన్పించుట సాంఘికంగా నైతికంగా అవశ్యకమైన సంస్కారణ సాంఘికమైత్రి, అస్పృశ్యతా నివారణవలె 1920 సం|| నుండి ఇది కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమంలో చేరినదైనను, ఇందుకు కాంగ్రెసు వారు తగుశ్రద్ధవహించలేదు. అహింసాకృషివల్లనే గమ్యస్థలం చేరదలచి నాముగదా! త్రాగుడు మత్తువల్ల బాధితులగు కోట్లకొలది ప్రజలయుద్ధరణను భావిప్రభుత్వమునకే వదలుట భావ్యంకాదు. త్రాగుబోతులను నల్లమందు

---

† ఇటీవల గాంధిగారు ఆదిమజనోద్ధరణను ప్రత్యేకాంశంగా ఎంచి, ప్రాముఖ్యతనిచ్చినారు. ముఖ్యంగా ఆంధ్రప్రాంతపు మన్యాలలో యీ సంస్కారణ చాల జరుగవలెను. పెల్లడిప్రాంతాల జనులక్కడ వసించి అకష్టముల బోగొట్ట యత్నించుట అవసరం.

భాయీలను ఆదురభ్యాసంనుండి తప్పించు మార్గాలు కనిపెట్టి, యరిష్టం పోగొట్టుటకు వైద్యులు చాలకృషి చేయదగును ఈ సంస్కరణ సాగించు టకు స్త్రీలకు విద్యార్థులకును మంచి యవకాశమున్నది. తమ ప్రేమసేవ లతో వారి యనురాగమునకు పాత్రులై వారాదురభ్యాసములు మానునట్లు ఒప్పించవచ్చు అలసిన కార్మికులు విశ్రాంతిని ఉత్సాహమును పొందుటకు శుచియగు చౌక పలహారాలు ఆటసౌకర్యం ఇచ్చు శాలలు కాంగ్రెసువా రేర్పర్చి ఉద్ధరింపవచ్చు. స్వరాజ్యపు అహింసామార్గమిట్టి నవ్యవృద్ధిసే సాగ వలె. హింసామార్గాలవారో, వీటినిప్పుడందుకోక, విముక్తి కల్గిన మీదట చూతమందురు. కాని, భద్రమగుస్థిర విముక్తి ఆత్మపరిశుద్ధిద్వారానే కల్గును గదా! నిర్మాణకార్యక్రమంలోని సేవాదీక్షితుల కృషిమూలమున ముమ్మందు మద్యపాన నిషేధచట్టము. అతిసులువుగా అమలు చేయుటకు వీలగును.

— గాంధీజీ

త్రాగుడు, నల్లమందు దురభ్యాసపరుల దేహమేగాక, మనస్సు నీతి కూడ చెడిపోవును. ఇందునుగూర్చిన చాల రచనలున్నవి ఈ పతితుల నుద్ధరింప గోరువారు చదువవలె. కార్యకర్త లీదురభ్యాసపరులతో పరిచయం చేసుకొని వారి జీవితదుస్థితి, వారి కుటుంబాలకు గల్గినబాధలు, తిండిలేక నిరాశులై పడుహైన్యము, జనులకు తెలియజెప్పవలె. త్రాగుబోతుల దేహము నాడులు చెడుటను, క్రమంగా వారువివశులై నీతిహీనులై భ్రష్టులగుదురని, మాజికులాంతరు, సినీమాచిత్రముల ద్వారాను చూపవచ్చు. త్రాగుబోతుల స్థితికి మద్యంముట్టని వారిస్థితికి ఎంతభేదముండునో, చిత్రవుల కథలద్వారా జనులకు బోధింపవచ్చు.

## ఈదురభ్యాసంనుండి దప్పించు ప్రత్యక్షమార్గాలు.

వీరికి బాధలేని పానీయాలీయవచ్చు, వారు విహరింప వీలగు క్లబ్బు లేర్పర్పవచ్చు. విశ్రాంతిసమయాలలో వీరితో సహవాసం చేయవచ్చు. ఈపను లకు సొమ్ము కావలసియుండును; సంస్థలే యిల్లు బాగా చేయగలవు; కాని వ్యక్తులు వారి యిండ్లకు వెళ్ళి, వారి విశ్వాసం చూరగొని మంచిపని చేయవచ్చు.

# 5. ఖాదీ.

నేను ఖద్దరుసిద్ధాంతంతో స్వరాజ్యానాకను గాలికెదురుగా నడుపుచున్నా నని, మంచివేతునని, ఘూర్వాంధ స్థితిని తెచ్చిపెట్టుదుననీ, అనేకులందురు.

ఇందును నాభావాలినివరకే తెల్పినాను. ప్రతిభారతీయుడూ ఖద్దరు అభివృద్ధికెట్లు పాటుపడవచ్చునో నేనూత్ర మిక్కడ చూపింతును. ఖాదీ జనుల ఆర్థిక స్వాతంత్ర్యమునకు సమత్వమునకు సోపానము. (అంటేనే రుచి తెలియును) పనిచేస్తేనె దానిసారం బోధపడును. స్వదేశీతత్వం, మన అవశ్యక వస్తువులను మన గ్రామజనుల శిల్పప్రజలద్వారా పొందు పరమార్థ నిశ్చయమూ, ఖాదీ సూత్రంలో ఇమిడియున్నవి. అనగా ఇప్పటివలె బ్రిటనులో ఇండియాలో అరడజను నగరాలు వృద్ధియగుటకు బదులుగా ఇప్పుడు పీల్చి పిప్పికాబడు మనయెడ లక్షల గ్రామాలూ స్వయంసంపూర్ణమై సంపన్నమై తమసరుకులను నగరాలకు అయావత్తకుతే విదేశాలకుకూడా పంపును. జనులు అహింసా తత్వపు శక్తిని జ్యోతిసి గ్రహించితే అట్టిస్థితియేర్పడును. జాతీ యైక్యము, ధన్యతకల్గును. అహింస అంటే అనేకులనుకొనే నిస్సారత మాంద్యము కాదు. అది లోకక్షేమము కాధారమగుబలిష్టశక్తి. ఖద్దరు భారతీ యైక్యమునకు ఆర్థికస్వాతంత్ర్యమునకు, సమత్వమునకు చిహ్నము అది (జవహార్లా లన్నట్లు) భారతీయ స్వాతంత్ర్యపు దుస్తున్న.

అయితే ఖాదీవుత్పత్తి సరఫరాలు వికేంద్రీకరించి, ప్రతిగ్రామంలో అక్కడి అవశ్యకతలు, పూర్తిచేయువలె పైగా, బస్తీలకూ కొంతపంపవలె ‡

ఇనుప కార్ఖానావంటి బరువు పరిశ్రమలు కేంద్రీకృతమై జాతీయాధికారం క్రింద సాగవలె. కాని అవి గ్రామాలలోని విశాల కుటీరపరిశ్రమల ముందర అల్పమౌతే ఖాదీకి చేయవలసిన దెంతైన యున్నది † పత్తి పండించుట, గింజ తీసి బాగుచేయుట, ఏకి యేకులు చేయుట, వడుకుట, అనుపోయుట, రంగులు వేయుట, పడుగుపేకలు వేసి నేయుట, చలవ చేయుట

---

‡ 1-7-45 నుండి ఖాదీవిక్రయంలో కొత్త పద్ధతి పెట్టినారు. గ్రామాలలో ఖాదీతత్వం వ్యాపించు నిమిత్తం ఖాదీదారులు నూలువడికించవలె. వడుకువారు ఖాదీనే ధరించవలె దీని మూల సూత్రం.

† మన ఆంధ్రదేశంలో ఆనాడు ప్రత్తిపంట హెచ్చేకాని ఇప్పుడు మంచిరకపు సన్నపొడుగు పోచగల్గి దూది, యెక్కువగా వచ్చి, సఫలమగా కొత్తరకాలు పండించుట చాలఅవసరం. సింధు, గుజరాతు, తమిళనాడులో ఈపని బాగా జరిగినది. నగలకు మంచి బంగారంవలె ఖాదీ [illegible] రకపు పత్తి మూలాధారం.

కూడ ఖాదీ పరిశ్రమలో భాగాలే. (రంగుతప్ప ఇవి అన్నీ అత్యావశ్యకాలే) ఇవి అన్ని గ్రామాలలో చేయవచ్చు ఇప్పుడెన్నియో గ్రామాలలో చర్కా సంఘంవారి కార్యాలు చేయుచున్నారు. వారి ఆఖరు నివేదిక ప్రకారం 13,451 గ్రామాలలోని, 271,146 జనులకు (అందులో 19,645 హరి జనులు, 57378 ముస్లిములు) వడుకుట నేతపనిగారల మజూరీకి రు 3485609 ఒక 1940సం|లో ముట్టినది ‡ వడుకువారిలో చాలమంది స్త్రీలు ఈఖాదీకార్యక్రమం కాంగ్రెసు వారు ఇంకా మనస్ఫూర్తితో సాగిస్తే ఇందుకు నూటరెట్లు ఉపయోగముండును. ఈ కేంద్ర పరిశ్రమ, ఇందులో అనుబంధపరిశ్రమలు బుద్ధిపూర్వకంగా నశింపజేయబడగా, గ్రామజనులు బుద్ధిని తేజస్సును గోల్పోయి, విభ్రాంతులై తుదకు తమపరిస్థిగపు పోషణలేని పశువుల స్థితికి వచ్చినారు. ఖాదీ సందేశం మన్నించి, కాంగ్రెసు వారందరూ ఖాదీవృద్ధికై అ. భా. చర్కావారిచ్చు సలహాలు ఆచరించి సాగించవలె. కొన్ని సామాన్య సూత్రాలనీ క్రింద తెల్పుచున్నాను.

1. నేల గల ప్రతివారు తమకుటుంబమునకు చాలినంతైనా ప్రత్తి పండించవలె. బీహారులో నీలిమందు వ్యాపారస్థులగు యూరపియనులు తమ అధికారపు నేలలో 1/3 వంతులో సేద్యదార్లు నీలినే పండించవలెనని రూలు ఉంచిరి. అట్లు విదేశీయులు లాభం నిమిత్తంకాక జాతీయ క్షేమం నిమిత్తం మన భూమిలో కొద్ది భాగంలో ప్రతిరయితు ప్రత్తిపండించకూడదా? † ప్రత్తినెక్కడనో పండించి దూరంలో ఎక్కడికో అంద చేయుచున్నారు. ఇప్పుడు జపాను ఎగుమతి కట్టుబడింది; ధరలు తారుమారగును. వికేంద్రీకరణమే మంచిది. తమ కుటుంబావసరము బట్టి పండించుటే మంచిది అట్లుంటే ధర వ్యత్యాసపు బాధ యుండదు.

2 వత్తిలేనివారు ఆవసరమైనంతే ప్రత్తికొనండి; ప్రత్తి రాటంతే కుండానే చిన్నగంటం ఒకబల్లచక్క సాయంలో గింజలు తీసివేయవచ్చు, లేదా

---

‡ ఇవి చర్కాసంఘపు ఉత్పత్తివి. ఇవిగాక ఇతరులుత్పత్తి చేసినమ్ము ఖద్దరు వల్లకూడా ఎందరికో పోషణ జరుగుచున్నది. వస్త్రపు పని అద్దకముకూడ ఖాదీకి అనుబంధము.

† ఆంధ్రదేశంలో ప్రత్తిపండించు చాల భూముల నిటీవల విద్యావంతులు జాతీయాభిమానులు గూడా విశాలదృష్టి లేకపోగాకు పంటకే వినియోగించుట శోకకరం. అర్థకాంక్ష ధర్మసమితంగా ఉండుట శ్రావ్యం.

చేతితో గింజ తీయించుకొని చిన్న విల్లుతో ఏకి, స్వయంగా ఏకులు చేయ
వచ్చు. ఇందుకు గ్రామస్థులకు చిన్నపనిముట్లేచాలు. ఇకవడుకుటకు ధనుష్
తక్లీ మంచిది. తరుచు, ఉపయోగిస్తుంటే నాకుదానిమీద రాటం మీదకన్న
సన్నగా వేగంగా, సాఫుగా, వచ్చుచున్నది కొందరి కట్లులేకపోవచ్చుకాని
చాల చౌక, సులభమును. రాటం వలే దీనికి కష్టపు మరమ్మతులుండవు,
సామానులు మరమ్మతులు ఎట్లు చేయవలెనో తెలిసియుంటేగాని తరుచు
రాట్నాలు మూలబడుచుండును. ధనుష్ తక్లీని సులభంగా సరుకుకొనవచ్చు.
లక్షలకొలది జనులకును సులభంగా దీనిని తయారు చేయించి అందరికినీవచ్చు
దీని బాధ మామూలు కదురు మీదకన్న నూలుతీయుట సులభము భారతీయు
లందరూ దీనికి పూనుకుంటే ఎంత ఐక్యపరిజ్ఞానములు కల్గునో అందువల్ల
ధనిక దరిద్రులమధ్య సమబుద్ధి యెంతయేర్పడునో ఊహించుము.

ఈనూలుకు వినియోగం 3 విధాలు బీదల లాభముకై చర్కాసంఘము
దానం చేయవచ్చు 2. స్వంతముకు ఖాదీబట్ట కొనవచ్చును. 3. లేక ఖిరా
యింపుకు ఖాదీబట్ట కొనవచ్చు * నూలు సన్నది మంచిది అయితే, విలువ
ఎక్కువ. కొత్తపరికరాలు మార్పులు పరిశోధనద్వారా కనిపెట్టితే ఖద్దరు
ఉత్పత్తి చాలా బాగుపడును. ఇప్పటివలె కాక విజ్ఞానముకు కర్మవిద్యకు
సమన్వయముంటే అమూల్యమైన లాభముండును. జనులందరు త్యాగబుద్ధితో
నూలువడికె పద్ధతి అమలుపవస్తే రోజూకుగంట మాత్రం వడికితేచాలు

గాంధిగారు దక్షిణాఫ్రికానుండి తిరిగివచ్చినప్పటినుండి, ఖద్దరుధ్యమం
జనులదృష్టి గోచరమైనది. ఇదివర కిందునుగూర్చి చాలవ్రాసియున్నాం
దున దీని మహాత్మ్యం విషయంలో విపులంగా వ్రాయనక్కరలేదు. వడుకుట
వంటి చేతిపరిశ్రమలు కావలెననుటకు మూలకారణాలు రెండు:— భారతీయు
లలో నూటికి 80 మందికిపైగా వ్యవసాయం మీదనే ఆధారపడినవారు.
ఐతే ఇందులో కొందరే అపని చేయుదురు. వారికిని సాలులో కొన్నినెలలే
ఆ పని వీరందరు. చాలకాలం వ్యర్థంగా ఉందురు. కనుక వారి కేదో సహాయ
వృత్తి కావలెను. ఇందుకు వడుకుట చేత తగినవి ఇందువల్ల గ్రామస్థులకు
బట్టల సమస్యపోవును; వారి కొద్దిరాబడికి చన్నీళ్ళకు వేడినీళ్లు తోడగును.

---

* ఇప్పుడు చర్కాసంఘపు విక్రయశాల లన్నిటిలో వడుకు నూలును
కిమ్మతుకట్టి తీసుకొని అందుకు ఖద్దరు నిచ్చుచున్నారు.

మరొకవృత్తిలో ఎక్కువసొమ్ము తెచ్చుకొనేవారు దానిని మానుకొమ్మని చెప్పము. ఇది అనుబంధ పరిశ్రమయే.

అమ్మకపుఖాదీ స్వయంగా వడకనివారి కుపయోగించును. ఉత్పత్తి సాధనాలు బాగుచేయగా, ఇప్పుడు మంచి సన్ననూలు తయారగుచున్నది. ఖద్దరులో కొత్తరకములు నేతలో సమత్వమూ తృప్తికరంగా ఖాదీని మిల్లుబట్టతో పోటీగా పరికించకూడదు. గ్రామాలబాగును దేశస్వాతంత్ర్యమును కోరువారందరు వెల యెక్కువైనను ఖద్దరునే కొనవలె. చరఖాసంఘంవారుచాల చోట్ల ఉత్పత్తివిక్రయస్థానాలేర్పర్చినారు, ప్రతికార్యకర్త వాటియేజంటు ననుకొని, ఖద్దరు ఆర్థికం గాను నైతికంగాను క్షేమకరమని, జనులను ద్ధరించునని, ప్రతిగృహస్థునికి నచ్చజెప్పవలె ఖద్దరు దానికి గిరాకీని, కలిగించవలె; అప్పుడు ఖాదీభాండారులలోని నిలవసరుకు చలామణియై కొత్తబట్ట ఉత్పత్తికి సొమ్ముదొరుకును,

ఈఅమ్మకం విషయంలో ఒక గమనింపు నిరాధారాలకు న్యాయమైన జీవనాధారకల్పించుటే ఖాదీ ఉద్యమపు ముఖ్యోద్దేశం. అట్లు జరిపించేదే నిజమైన ఖాదీ అందువల్లనే (తక్కిన వ్యాపారస్థులవలెకాక), పనివారడుగకపోయినంతత్వరలో, వడుకువారి (8 గంటల్ల పనికి)రోజుకు అధమం 8 అణాల జీతమీయ చర్ఖా సంఘం వారు నిశ్చయించినారు, ఈ ఆదర్శం ఇప్పుడు ఇంకా సాగలేదు; కాని అంతవరకున్న ఒకఅణాకుబదులు మూడేండ్లనుండి రోజుకు మూడణాల కూలి నిచ్చుచున్నారు. అందువల్ల ఖాదీధర పెరిగి ఖాది అమ్మకం తగ్గలేదు; ఇది సంతోషకరం, స్వార్థపరులుమాత్రం (పాపం) కూలిలలో పోటీపెట్టి, కొద్ది కూలినేయిచ్చి వారిని శోషింప జేయుచున్నారు. పనివాండ్రకు సరసమైనరేటు కూలినిచ్చు విక్రేతలకే చరఖాసంఘంవారు ధ్రువపత్రాలనిత్తురు. ధ్రువపత్రంలేని దుకాణదార్లవద్ద ఖద్దరు కొనకూడదని ఖాదీసేవకులు జనులకు బోధించవలె.

అట్లు ఖాదీఉత్పత్తి అమ్మకమూ సంఘంలో సరిగా సాగించవలెకాని కాని మనభారతజాతి ఆర్థికస్థితిఖద్దరువల్లనే బాగుపడునని గ్రహించి, అందరూ రోజూ నూలువడికితేనే జనసామాన్యంలో ఖద్దరు వ్యాపించును. సామాన్యంగా గంటకు 400 గజములు తీయవచ్చు అనగా రోజుకొక గంట వడికితే నెలకు 12000 గజాలనూలు వచ్చును. ఏకులు మంచివై బాగా వడికేవారినూలు నాజూకుగ గట్టిగనుండును. పది పండ్రెండు నెంబర్లనూలు సామాన్యంగా

ఎవరైన తీయవచ్చు. అట్టి 12,000 గజాల నూలుతో నాలుగు గజాల యేర్పడును. ఇట్లు రోజుకొకగంటయే వడికితే సాలుకు 48 గజాల బట్ట తయారగును. మన దేశంలో దామాషాను మనిషికి సాలుకి 16 గజాల గుడ్డ ఖర్చగుచున్నది. కనుక మొత్తంమీద ఒక్కొక్కరు ముగ్గురికవసరమయేబట్ట సిద్ధపర్చవచ్చు. తలచుకుంటే వ్యవసాయదార్లు (తక్కిన "గౌరవవృత్తు"ల వారును) రోజుకొక గంట వడుకుట సులభమే, ఇందువల్ల జాతి కంతకు చాల లాభించును, 16 గజాల మిల్లుగుడ్డ వెల 4 రూపాయలు, ఇప్పుడు మన బీదలరాబడి చాలతక్కువ. అందుకు సాలుకు 4-0-0 లు హెచ్చుట మంచిదే. పైగా బట్టల విషయంలో స్వావలంబము సాంఘికంగాను నైతికంగాను చాల మంచిది. ఐదుగురి కుటుంబంలో ఇద్దరు వడుకుచుంటే కుటుంబమునకు వస్త్రమేర్పడును ప్రతిపనివాడు తన బట్టకవసరమయే నూలు వడుకుకోవలె. రాట్నంమీద, కదురుమీదను, బాగా వడుక నేర్చుకోవలె. వడుకుటకు ముందు చేసేవి — ప్రత్తి యేరుట, శుభ్రపర్చుట గింజతీయుట, ఏకి యేకులు జేయుటకూడ నేర్చుకోవలె. పనిముట్లన్నిటిని శుభ్రపర్చి మంచిస్థితిలో నుంచవలె. వట్టి వాదప్రచారంకన్న శ్రద్ధయుక్త ప్రవర్తనవల్లనే ఆకర్షితులై చాలమంది ఖద్దరు అభిమానులగుదురు నేతకూడ నేర్చుకోవలె. కూలికి వడికించుటను చరఖాసంఘంవారికే వదలి, స్వావలంబపు పద్ధతినే జనులకు నేర్పుడు.

ఇందుకు మూలధన మక్కరలేదు. తన అనుభవోత్సాహముల నితరునికి గల్గించు శక్తిమాత్రం కావలె. తన పరిస్థితిని ఆప్రాంత స్థితినిబట్టి ప్రతిఖాదీ సేవకుడును తన కార్యక్రమ మేర్పర్చుకొనవలె. 6 నెలలలో పండ్రెండుమందికి ఖద్దరు విషయంలో స్వావలంబ నిశ్చయం కల్గించి వారిచేత నూలు వడికించి గల్గితే, అక్కడకు మంచిపని చేసినట్లే. సాధారణంగా ప్రతియూరిలోను ప్రత్తిపండును లేదా ఖరీదుకు దొరుకును ప్రతివ్యవసాయదారు తన కుటుంబమునకు తగిన ప్రత్తిని పండించుటే ప్రశస్తము. సాధారణంగా గ్రామాలన్నిటిలో నేతగాండ్రు పనిలేక యుందురు. కనుక పరికరాలన్నీ సిద్ధమే. ఇక ఖద్దరు ఉత్పత్తికి దీక్ష, ఉత్సాహము, కార్యశూరత ఉంటేచాలు. గ్రామ జీవిత మంతయుమారి, క్రాంతియేర్పడును. †

---

† ప్రతివారు గ్రామాలలో యింటిపెరళ్ళలో ప్రత్తిమొక్కలు పెంచుకొని, ఆపండుప్రత్తిని దూది చేసినను చాలు; కంబోడియా, సింధు, జడపత్తి, వంటి మంచిరకాలే వేయవలె.

# 6. తక్కిన గ్రామ పరిశ్రమలు.

ఈతక్కిన పరిశ్రమలు ఖాదీకి అనుబంధమైనట్టివి; వీటిలో ప్రతిదానికీ కొలది మందియే పని చేయవలె. ఇవియు ఖాదీయు పరస్పరం సహాయకములు. చేతితో విసరుట, దంపుట, సబ్బు, కాగితం అగ్గిపెట్టెలు నేయుట, చేలు దున్నుచేసి బాగుచేయుట, మాను ఆడుట, ఇట్టి ఆవశ్యక కార్యాలు లేకుంటే గ్రామాల ఆర్థికజీవితం సంపూర్ణమే. కాంగ్రెసు వారు శ్రద్ధచేసి, గ్రామాలలో వసించి, ఈ పరిశ్రమల నుద్ధరించి నవజీవితం కల్గించవలె. అట్టి గ్రామవస్తువులనే దొరికినంతవరకు వినియోగించుట గౌరవప్రదమని అందరూ గ్రహించవలె. అట్లువాటికి గిరాకికల్గిస్తే గ్రామాలలో చాలవస్తువులు ఉత్పత్తియైతాగలవు గ్రామమనస్కులమయితే, పాశ్చాత్యరాతి యాంత్రిక వస్తువులపై చాపల్యముండదు ఇట్లు దేశప్రదారిద్ర్యం, నిరాహారత, నిరుద్యోగత, తొలగగా నవ్యభారతపు మనోహరత గోచరించి, జనులకు నిజమగు జాతీయ రుచియేర్పడును.

గ్రామపరిశ్రమలన్నిటి నాయకమణి వ్యవసాయమే. అందువల్ల జనుల తిండికి బట్టకువలయు ముడివస్తువులన్నియు లభించును. కాని యిప్పుడుద్దేశించు 'పరిశ్రమ' అర్థం వేరు — చేతిశిల్పంతో ముడివస్తువులనుండి సరుకులు తయారుచేయుట; చేతిపరిశ్రమ నశించుటే గ్రామముల దుర్దశకు హేతువైనది. వ్యవసాయికులు సగంకాలం పట్టిసోమరులై సాగువల్ల గిట్టుబాటులేక, అల్లాడుచున్నారు.

ఖాళీలో వ్యవసాయకులు నూలువడికి నేసుకొనుట లాభకరమైనట్లే తక్కిన చేతిపరిశ్రమల వృద్ధిచేస్తే గ్రామసౌభాగ్యము పెంపొందును; పరాధీనతపోవును; గాంధిగారఖిలభారత గ్రామపరిశ్రమ సంఘము నేర్పర్చిన ఉద్దేశ్యమిదే. ఆదెట్లనగా గ్రాసపుగింజలన్నీ పొలంమీద పండును. అందులో గోధుమ వగైరాలను పప్పులు, విసరవలె; ధాన్యాలుదంచవలె; పొట్టు చెరగవలె. ఈ పనులన్నిటిని గ్రామస్థులు తమయిండ్లలో చేసుకొనేవారు ఇప్పుడో! బియ్యపు, పిండి, పప్పు మిల్లులు వెలసి, రోళ్లు, తిరుగళ్లు, చాల వరకు మూలబడి గ్రామస్థుల పనిపాటలుపోయి సోమరులైనారు. ఆగింజల జీవశక్తియు తగ్గి, తినువారి ఆరోగ్యము చెడినది. నూనెగింజల సంగతియు

బుట్టినదే. మనభోజనసామగ్రిలో చమురును ముఖ్యమే దాని జీవశక్తి తగ్గినను మనదేహమునకు హానియే.

తిండిలో తీపియు నుండవలె; ఇందుకు ముఖ్యాధారముగు చెరకు సులభంగా పెరుగును; అనాదిగా చెరకు గానుగలలో పెనాలలో బెల్లం తయారయేది. ఈ రంగంలో పంచదార మిల్లులు రాగా, బెల్లపు పరిశ్రమ అడుగంటు చున్నది. * బాగా తీపినిచ్చు మరొకటి తేనె; దానిని కూర్చు తేనెటీగలను చాల వ్యయ ప్రయాసములు లేకుండనే పెంచవచ్చు. కూరగాయలు పండ్లుకూడ అవసరమైనవే. వీటిని గ్రామాలలో బాగుగ పండించి వృద్ధిచేయవలె. పాలు పెరుగు నెయ్యియు ప్రధానములు. వైజ్ఞానికంగా మంచి జాతి గోవులను బుట్టించి, గోశాలల స్థాపించి, గోరక్షణద్వారా పాడి పంటల సమృద్ధి జేయించవలె.

పేడ, పంటలు వ్యర్థంకాకుండ ఎరువుజేయుడు, పండ్లపైతోలు, ఆకులు, ఆహారశేషములు, బూడిద, ఎముకలు, జంతుమాంసము తోలు ఇట్టి వాటిని వ్యర్థపర్చక వినియోగించుడు.

వ్యవసాయాదుల కన్ని పనిముట్లను బాగుపర్చి, మంచిరకములను గ్రామాలలో సమృద్ధిగ తయారుచేయుడు.

భోజనం బట్ట అయినమీదట గృహము. కొందరు శక్తిలేకున్నను దర్జాకు గొప్పయిండ్లు కట్టుదురు. వీలైనంత వరకు గ్రామపరికరాలే ఉపయోగించి, గ్రామజనులచేతనే యిండ్లు కట్టించితే, ఆర్థికంగా గ్రామాలు బాగుపడును. ప్రకృతిదేవిలో జాగ్రత్త పొదుపు కల భూగర్భంలో నేలబొగ్గు, కిరసినునూనె, ఇనుమువంటి లోహాదులు ప్రకృతి సిద్ధపర్చును ఇవి యేర్పడుటకు లక్షలకొలది యేండ్లు పట్టునని భూతత్త్వజ్ఞులు చెప్పుదురు. కాని వాటి నెంత దుబారాగా ఖర్చుచేయుచుంటిమి ! వాటిని మనము పుట్టించు టెంత కష్టము ! ప్రకృతి పొదుపుగనున్నను మన వైజ్ఞానిక గర్వంతో ఆవస్తువులు పాడుచేయుచు ప్రకృతి భద్రపర్చిన నిలవసామాగ్రి అయిపోవునను జ్ఞానంలేకయున్నాము. ఇట్టి ఈదుబారా ఖర్చుకు ఇప్పుడున్న పెట్రోలు, బొగ్గు,

---

* ఫాక్టరీల పంచదారకన్న నాటుబెల్లమే ఆరోగ్యకరమైనను, పంచదార తయారులో చాల ఫాక్టరీలు ఎముకలపొడిని కూడ వాడుచున్నను, గ్రామాలలో శ్రోత్రియులు గూడ పంచదార తినుచున్నారు. బెల్లమునే వాడుట అవసరము.

లోహములు ఇంకెన్నియేండ్లకు చాలునని దూరదృష్టిగల కొందరు లెక్కవేయుచున్నారు. అది యాంత్రిక సంస్కృతిగల దేశాల కేర్పడు సమస్య. మన గ్రామాలలో ఖర్చుపర్చు వస్తువులు మరల యేర్పడునట్లని మనము చూచుకోవలె, ఉ॥ గ్రామాలలో వంటచెరుకుకు నాటుపుల్లలు సమృద్ధిగ దొరుకుట కేర్పాటుకావలె. కొన్ని చెట్లకొమ్మలందు కుపయోగించును. ఇండ్లు కట్టు కలప సమృద్ధిగ దొరకవలె. ఇండ్లకు వాడు యిటుక పెంకు నేలబొగ్గు ఖర్చు లేకుండ చౌకగ చేయవచ్చు. కొద్దిగ లోహము పెట్టినను, చౌకగ నాటువస్తువులతోనే యిండ్లుకట్టుట మంచిది. ఇప్పుడున్న మన భవనాలన్నిటిలో అద్భుతమైనది నేలబొగ్గు సిమెంటు ఉక్కు వాడక పూర్వమే కట్టినదిగదా!

ఇవిగాక మరికొన్ని రోజూవాడుకొనేవి కలవు; సూది, కలము కత్తి మొదలు మోటారు, రైలుబండి, విద్యుచ్ఛక్తివరకు ఎన్నియో అవసరమగుచున్నవి. జరూరైన మన యవసరాల్లో సులభంగా తయారగు వాటినే వాడుకోవలె. మనపల్లెల శిల్పులెన్నింటినో చేయగలరు; ముడిపదార్థాలు దొరుకును. కొన్ని ప్రాంతాలలో లోహాదులు తయారైనట్లు నేటికీ చెప్పుదురు. అట్టివాటినికనిపెట్టి, పునరుద్ధరింపవలె. తరుచు గ్రామాలలో కాగితాలు తోలువస్తువులు చేయుపరికరాలు, పనివాండ్రు సిద్ధమే శ్రద్ధ దూరదృష్టియు కావలె † విశేషంగా రకరకాల ముడివస్తువులు పనికి కోట్లకొలది ప్రజలు గల మన దేశపు జనులకు పని కల్పించు దృఢ సంకల్పంతో కృషి చేయుడు. మన అవసరాలలో కొన్నిటికి మాత్రం పెద్దయెత్తు పరిశ్రమలు కావలె, నిజమే; కాని, కుటీరపరిశ్రమలు వృత్తులు నశించినందువల్లనే మన గ్రామజీవితము సంస్కృతి కళలు క్షీణిస్తున్నవి. భారతీయ గ్రామాలు బాగుపడవలెనంటే, పల్లెల పరిశ్రమలు పునరుద్ధరించుటే సాధనం గాంధిగారన్నట్లు గ్రహకూటంలో సూర్యుడు ముఖ్యుడైనట్లే, ఖద్దరే కేంద్రంగా పెట్టుకొని, మిగతా గృహపరిశ్రమలను వృద్ధిచేయవలె.

# 7. గ్రామ పరిశుద్ధి

జ్ఞానకర్మలకు సమన్వయం లేనందున, బుద్ధిమంతులు క్రియాపరులు కాక గ్రామాలు అశ్రద్ధపాలై చెడుచున్నవి. కనుకనే, దేశమంతటా

† చేతితో కొంత తయారు చేయుటకు పాతగుడ్డ పేలికలు చిత్తుకాగితాల ముక్కలు వెదురు ఎండువరిగడ్డి వగైరాలన్నియు ఉపయోగించును; ఇటీవలనుంచి మంచి రకపు చేతి కాకితము తయారగుచున్నది.

గ్రామాలు మనోహరంగా ఉండుటకు బదులు పేడకుప్పలవలె తయారైనవి. చాలా గ్రామాలకు ప్రవేశించు మార్గం అసహ్యంగా ఉంటున్నది. తరుచు ముక్కు కళ్లు మూసుకొందమనిపించునంతమాలిన్యమూ, వాసనయునుండును. కాంగ్రెసు వారిలో హెచ్చుమంది, గ్రామ జనులే అయియుందురు. వారు తమ గ్రామాలను అన్నివిధముల పరిశుద్ధంగా వుంచవలె కాని, వారింతవరకు గ్రామ [illegible] నిత్యజీవితంలో తాము నిమగ్నులైయుండి. ఏకత్వ మొందవలె నని గ్రహించలేదు. సాంఘికంగా జాతీయంగా పరిశుద్ధభావముయుండి ముఖ్య గుణమని; అది మనకలవడలేదు. మనము స్నానాలయితే చేయుదుముగాని, శౌచకార్యాలు చేయుటలోనే అప్రక్కనున్న నూతినో చెరువునో నదినో కల్మషం చేయుటయు జరుగును. ఈ శౌచ మొక గొప్పదోషం; ఇందువల్లనే మన గ్రామాలు, పవిత్రనదీ తీరాలుకూడ దుస్సహస్థితిలో నున్నవి ఈ అపరిశుభ్రత వల్ల వ్యాధులు వ్యాపించు చున్నవి.

— గాంధీజీ

గ్రామాల అవసరములలో నొకటి పరిశుద్ధి. తమ పరిసరాలు దేహం శుభ్రంగా ఉంచుకోనందున రోగాలు, అంటువ్యాధులు, అనారోగ్యమూ వ్యాపించుచున్నవి శౌచము దైవసంపత్తు మానసికంగాను ఆధ్యాత్మికంగా కూడా శౌచ మెంతో ముఖ్యము. ‡

గ్రామసేవ చేయువారు స్వయంగా శుభ్రంగా ఉంటూ దేహం దుస్తులుకూడా శుచిగానుంచుకోవలె, మలినతకు తావుంచకూడదు. ప్రతివస్తువును చెత్తను ఎక్కడనైన వేయుట, ఇంటిలోను, వసారాలలోను, వీధిలోను ఉమ్మివేయుట, చీదుట, కాపురముండు ఇండ్లప్రక్కనో వీధిప్రక్కనో చెరువుల నూతుల ప్రక్కనో బయలుకువెళ్లుట, ఆ అశుద్ధము తప్పక అట్లే విడుచుట, ఇట్టి దురభ్యాసములన్నియు రోగమును పొరుగువారి కసహ్యమును పుట్టించును. పెంటను భద్రపరచి యెరువుగ చేసుకోనందున, ఎంతో సంపద నష్టమగుచున్నది.

అపరిశుభ్రత దురభ్యాసాలు ఎంత అనర్థకరములో ప్రజలు సరిగా గ్రహించితే, గ్రామములు పరిశుద్ధమై బాగుపడును. ఈ క్రిందిపద్ధతు లాచ

---

‡ మనశాస్త్రములన్నిటిలోను శౌచముకత్యంత ప్రాముఖ్యమిచ్చినారు. ఉదయాది రాత్రిపర్యంతం శౌచవిధు లేర్పర్చినారు; వాటిని చాలమంది చేయుటలేదు; చేయువారును అందలి ఉద్దేశం సాగించక, నిరుపయోగంగా ఆచారమని, తప్పుగ చేయుట జరుగుచుండుట; ఇది శోచనీయము.

రింపరాదు. గ్రామాలకువెళ్లుకోడ్లును గ్రామవీధులును రోజూ ఊడ్పించవలె, వాటిలో పెంట వేయకూడదు. చెత్తడబ్బాలోనే పెంట వేసి, తరువాత దాని నొక గోతిలో ఎరువుగ చేసుకోవలె, పిల్లలుకూడ వీధులలో బయటకు కూర్చోనీయకూడదు. పెరళ్లలో మురికినీరు వీధులలోకి పారనీయకూడదు. మురుగునీటిని సన్న కాలువద్వారా మొక్కలకు పెట్టి, ఉపయోగించుకోవలె.

(ఖ) పొలాలలో బహిర్భూమికి వెళ్లితే, అశుద్ధంపైన శుభ్రమైన మట్టివేసి కప్పవలె అంతకన్న మంచిది, కర్ర లేదా వెదురుచట్రమునకు చిన్న చాపముక్క బిగించి ఒకటిరెండడుగుల లోతు వెడల్పుగల గోతులలోపెట్టి, చాకకక్కొసుగ వాడుకోవచ్చు. ఇక్కడను అశుద్ధమును శుభ్రమగు మట్టితో కప్పవలె. అది త్వరలోనే మంచి యెరువుగమారి, అసహ్యకరమగుటకు బదులు లాభకరమగును.

(గ) పశువుల పేడ, చెత్త, కూరల బెరడు, పండ్లతోలు, ఇత్యాదులను ఇట్లే ఎరువుగ చేసుకోవచ్చు.

(ఘ) నూతులు, చెరువులు, నదులు, కాలువలువంటి జలాశయాలు వాటిగట్లుకూడ శుభ్రంగా ఉంచుకోవలె. కొందరు జలాశ్రయాల నీటిలో పశువులు కడిగి, మైలబట్టలుతికి. అంటుశిస్నీలుతోమి, అట్టినీటనే త్రాగుచున్నారు జనుల అజ్ఞానం అశ్రద్ధవల్ల ఇట్లున్నది స్థితి. పల్లెలజనుల కీవిషయాలు బోధింపవలె.

(జ) ప్రతి వ్యక్తి ఆరోగ్యంపైన చాలవరకు గ్రామమంతటికి ప్రభూదం కలుగవచ్చు. యువకులు, యువతులు సేవకదళములుగ నేర్పడి, జనులకుబోధించి గ్రామారోగ్యం కాపాడవలె, ఆసేవకులు స్వయంగా తుడుచుట పాకీపని చేయవచ్చు, బోధించుటకన్న స్వయంగాఆచరించుటేమంచిప్రచారసాధనము.

## 8. నవ్య విద్యావిధానము.

మన విద్యావిధానంలో కొత్తపద్ధతి యేర్పరుప నుద్యుక్తులై కాంగ్రెసు కార్యసమితివారు అందుకు హిందూస్తానీ తాలిమీ సంఘంవారి కధికారమిచ్చినారు. అది హరిపుర కాంగ్రెసు నాటినుండి కృషిచేయుచున్నది. ఈ మహారంగలో కాంగ్రెసువారికి సేవకులకు చేతినిండ పనియుండును. గ్రామాలలోని పిల్లలను ఆదర్శ పౌరులుగ చేయుటకై ఈవిధానం గ్రామాలలో సాగింపవలె

అట్లు చేస్తేనే స్వరాజ్య భవనము పునాదినుండి సరిగా నిర్మితమగును. ఈ విదేశాధికారమునకు విద్యారంగంలో శిశు విద్యలోనే మూలమేర్పడియున్నది. ఇప్పటి ప్రైమరీ విద్య మన గ్రామజనుల పురజనుల, అవసరములతో సంబంధం లేనిదై, హాస్యాస్పదంగా ఉన్నది. క్రొత్తగా ఏర్పర్చిన 'బేసిక్' (ప్రాతిపదిక) పద్ధతి విద్యను అంతటా చాలవరకు నేర్పితే మన సంస్కృతిలోని స్థిరమైన విశిష్టత జనులలో బాగా నాటుకొనును. విద్యార్థుల దేహము బుద్ధి వృద్ధియై జాతీయత రక్షితమగును. వారట్టిబడులలో తయారై అద్భుతముగ భావిసీతిని నిర్మింప దొడ్పడుదురు. ఈ బేసిక విద్య నిజంగా ఉత్తేజకమని, బాలబాలికలకు తమకు గూడ లాభకరమని కాంగ్రెసువారు గ్రహింపవలె. ఇందుగూర్చి జిజ్ఞాసువులు సేవాగ్రామములోని ఈ సంఘపు కార్యదర్శితో సంప్రదించి గ్రహింపవచ్చు.

— గాంధీజీ

గాంధిగారు మన గ్రామజీవితపు అవసరములకు తగినట్లు మూలసూత్రములుగల విద్యావిధాన మేర్పర్చినారు. ఇప్పటి నిరుపయోగ పద్ధతి మాన్పి, చేతిశిల్పంద్వారా జ్ఞానోదయం కల్గింతురు. శిశువుల సహజనిర్మాణశక్తినివృద్ధి పర్చి, దానిని సవ్యంగా వినియోగించుట దీని మూలోద్దేశము. ఈపద్ధతి మనస్సునేగాక, చేయి కండ్లుమున్నగు ఇంద్రియాలవన్నిటిని తరిఫీయతు చేయును. అయావృత్తి విద్యలో సమర్థులగువారు బాలురకు ప్రేమతో సరిగా నేర్పితే, ఇప్పటికంటె బాలవిద్యార్థుల మనశ్శక్తి, నీతి, దేహబలము కూడ, చాల హెచ్చుగ తెలివితో సాగించితే, ఈబడులలో తయారగువస్తువులు వారు ఆ చుట్టుపట్ల అమ్మవచ్చు; లేక సర్కారు ఖర్చుచేయవచ్చు; ఆసొమ్ముతో ఆ యుపాధ్యాయుల జీతంవగైరా ఖర్చులెత్తిపోవును. ఈరీతిగ నివి స్వపోషకమగునని గాంధిగారివాదము. ప్రస్తుతం ద్రవ్యంలేకనే ప్రాథమిక విద్యను జనసామాన్యమునకు నేర్పుటకు కొంత వీలుకాలేదు. ఈద్రవ్యలోపమిట్లు వదలిపోవును. గ్రామాలలో వడుకుట వీలయి తెలిసినది. కనుక ఆరంభం నూలు వడుకుటనే అన్నిబడులలో పెట్టుటకు తీర్మానించినారు; కాని క్రమంగా ఇతర శిల్పాలను పెట్టవచ్చు, ఇందునుగూర్చి శ్రద్ధగలవారు హిందూస్తానీ తాలిమీసంఘంవారి నివేదికను గ్రంథములను పరిశీలింపవగును. ఇప్పుడెన్నియో అడ్డములు, కష్టములు నున్నను, ఈవిద్యావిధానంలో, చాల అభివృద్ధికల్గినదని ఈ సంఘపు నివేదికవల్ల కనబడును. కేవలం పుస్తకాలనుండి విషయాలు బుద్ధికెక్కించుటకంటె, చేతికి పనియిచ్చి, తద్ద్వారా అనుభవం కల్గించి, సంగ

తులు గ్రహింపజేయుటే ఉత్తమపద్ధతి, అని యిటీవల లోకమంతటి గొప్ప విద్యావిశారదులు నిర్ణయించినారు; అందులోను ఈపద్ధతి మనదేశజనుల ప్రత్యేకస్థితికెంతో లాభకరము. ఈవిధానము జయప్రదముగా నడిపించవలె; అందుకు చక్కగ శిక్షణపొంది ఉత్సాహులైన స్త్రీలుగూడ ఉపాధ్యాయులు కావలె.

# 9. వయోజనవిద్య†

వయోవంతులందరికి విద్యనేర్పు విషయంలోను కాంగ్రెసు వారు శ్రద్ధ చూపలేదు; చూపినవారును నిరక్షరులకు చదువను వ్రాయను నేర్పుటలో తృప్తులైనారు, వయస్కులకు విద్యఅంటే ముందుగా మనదేశపు విస్తీర్ణం, మహాత్వ్యం, నేర్పవలె. గ్రామీణులకు స్వగ్రామమే ముఖ్యం; దానినే బయటకు పోతే స్వగృహంగా స్మరించును! దేశమంటే భూగోళపదంగానే తోచును. గ్రామజనుల అజ్ఞానమపారం. ఇది పరపాలనమనీ దానివలని అనర్థాలును, వారికి తెలియవు విదేశసంఘర్షణ' వల్ల, వారికి బెదురూ నిస్సహాయత మాత్రం, అబ్బినవి. అందుపైన భీతిద్వేషము లేర్పడినవి. వాటినుండి ముక్తి చెందుటెట్లో తెలియదు. ఆపరప్రభుత్వమును వదల్చుటకొను శక్తి తములోనే యున్నదని వారు గ్రహింపలేదు వారి దౌర్బల్యం పోవునట్లు రాజకీయ పరిజ్ఞానం సంభాషణ ద్వారానే కల్గించుట వయోజనవిద్యయే ఇట్టి విద్యను నిర్భయంగా నేర్పినను, ప్రభుత్వోద్యోగు లడ్డుకోరు. అడ్డువచ్చినను ఈప్రాథమిక హక్కు రక్షణకై పోరాడవలసినదే (అకృషి లేకుండా స్వరాజ్యము రాదు) అది బహిరంగంగానే అహింసాయుద్ధంలో భయమూ రహస్య పద్ధతి కూడదు. ఈనాటి విద్యతో బాటే అక్షరజ్ఞానమూ నేర్పుడి మాత్రంలో నేర్పుటకు కొన్ని సాధనాలు చూపుచున్నారు. దీనికి సరిగా రూపమిచ్చి దారిచూపుట కార్యసంఘాలవారొక విజ్ఞ సమితి ఏర్పరుపవచ్చు. పైనేను వ్రాసినది సూత్రంమాత్రమే పనిసాగించుటకు వివరాలు చెప్పలేదు. ఈపనికందరూ

---

† వయోజనవిద్యవల్ల లోకజ్ఞానం, జాతీయాభిమానం కల్గుటే గాక పత్రికా పఠనముకును అవకాశముండును. అంతే, కాక, ప్రస్తుతం చదువు తెలిసిన వారికందరికీ మనరాష్ట్రములో 'వోటింగు' అనగా ఎన్నికలలో వోటిచ్చు హక్కు కల్గును. కనుక వయోజన విద్యద్వారా ప్రజలందరికి వోటింగుహక్కును సాధించవచ్చును.

# 10. స్త్రీల యుద్ధరణ.

ఇదివరకుండిన అధోగతినుండి కొద్దికాలంలో స్త్రీలు బయట బడుట సత్యాగ్రహోద్యమంవల్లనే కల్గినది. కాని, ఈ స్వరాజ్య యుద్ధంలో స్త్రీలు తమతో సమంగా వాటాదార్లనీ, ప్రజల సేవాకార్యంలో నిజమైన సహాయకులనీ, పురుషులింకను గ్రహించ లేదు. నిబంధనలన్నీ పురుషనిర్మితాలు. వాటి అములువల్ల స్త్రీలు అణగిపోయినారు. అహింసాజీవితంలో పురుషునివలె, స్త్రీయు తన భవిష్యత్తును నిర్ణయించుకోవచ్చు, అయితే, హక్కుతోబాటు బాధ్యతలు నుండును. కనుక, సాంఘిక జీవితపు నియమాలు పరస్పరం సంప్రదింపు సహాకారంతో నిర్ణయించవలె, నిర్బంధము కూడదు. పురుషులు పుట్టడంలో వర్తించుటలేదు; స్త్రీకి మిత్రుడు సహచరుడుగానుండుటకు బదులు ఆమెకు ప్రభువు యజమానిగ భావించుచున్నాడు. చేయూతతో స్త్రీలను ధరించుటే పురుషధర్మము. పూర్వం బానిసలు స్వేచ్ఛనెరుగక, స్వేచ్ఛవచ్చినప్పుడేమిచేయుటకు తోచక దిగ్భ్రమజెందిరి. యిప్పుడు మన స్త్రీలట్లేయున్నారు. వారినుద్ధరించి, తమతో సమానంచేసి, వారు తమకార్యం నిర్వహించునట్లు పురుషులు చేయవలె. నిశ్చయముంటే, ఈ క్రాంతి సులభమే. కాంగ్రెసువారు ముందుగా తమ యిండ్ల స్త్రీలు తమ వినోదభోగములకే అని తలచుటమాని సహధర్మచారిణులుగనే ఎంచవలె. వారికందుకు తగువిద్య నేర్పవలె. భార్యలనేగాక తల్లులను కొమార్తెలనుకూడ గౌరవించవలె స్త్రీలు అసహాయలనుట కొంతవరకేనిజం. గ్రామాలలో తరుచు స్త్రీలు మగవారితో సమానస్థితిలో నుందురు. కొందరు తమపురుషులపైన అధికారం చలాయింతురు; కాని, ఇప్పటి కులాచారంలు చట్టము, స్త్రీలకు హానికరమని నిష్పక్షపాతులందరికితోచును. కనుక వాటిని పూర్తిగ మార్పించవలె.

స్త్రీలు శక్తిస్వరూపలు, అనగా జీవశక్తికంతకు మూలాధారలు, అని మన సంప్రదాయము. సంఘపు, రెండుభాగాలలో స్త్రీభాగమే విశిష్టమందురు. కాని ఇట్లు సాగుటకు మన ప్రస్తుతసంఘములలో అవకాశం లేకున్నది. ఇది విచారకరము. కొన్ని సంఘాచారములు మూఢభావములు సంప్రదాయముగ నేర్పడి యుండుకడ్డమయినవి. సంఘపు అర్ధాంగం అణచబడియుంటే, సంఘమెట్లు వృద్ధిపొందును? శిశువుకు మొదట తల్లినుండియే జ్ఞానమేర్పడును. స్త్రీలుమూఢలై దుర్బలలై యుంటేసంఘంలో ఉత్తమపుత్రులు

అట్టి పుత్రికలు పుట్టుట అసంభవం కాదా? కనుక స్త్రీజాతి హీనం నీచం అనే భావమువదలి స్త్రీలను పురుషులు తమతో సమంగానే చూచుకోవలె; అంటే పురుషులపనిని ఆడంగుల కొప్పగించుమని, స్త్రీలపనిని మగవారు చేయుమని, దానిభావం కాదు. సహజసౌకర్యాలు, ప్రకృతి నియమాలు మారేవి కావు. వేరేవి కావు. వేరే విభేదాలు నిర్బంధాలు మాత్రం పెట్టకూడదు.

ప్రకృతి విరుద్ధాలు అన్యాయాలు, సంఘమునకు బాధకాలు అగు నిర్బంధాలను అచారాలను పోగొట్టుటకు సంఘసేవకులు పూనుకోవలె. జనోపయోగమైన సార్వజనిక కార్యాలకు స్త్రీలతోకూడా కలిసి సమంగా పని చేయించవలె.

(గ) బాల్యవివాహములను మానివేయవలె.

(ఘ) వితంతువులు పునర్వివాహం చేసుకొన ప్రోత్సహించవలె.

(ఙ) మగవారిద్దరుముగ్గురను పెండ్లాడుటను మాన్పించి ఏకభార్యాత్వం నెలకొల్పవలె.

(చ) ఇప్పుడు చట్టంలోను ఆచారాలవల్లను స్త్రీల కేర్పడిన ప్రత్యేక బాధలు కష్టాలు పోగొట్ట యత్నించవలె.

(ఛ) బాలురతో పాటు బాలికలకును సమంగా విద్య నేర్పించవలె. జీవితవృత్తి సంపాదించుశక్తి గల్గించవలె.

(జ) స్త్రీలలో స్త్రీలే బాగా ప్రబోధం చేయగలరు. పరోపకారులగు స్త్రీలకును విద్యను రాటపుపనిని నేర్పు టవసరము. వడుకుట స్త్రీలప్రాభవంలోది అందువల్ల వారికి అర్థికంగాను ఉపయోగించును.

(ఝ) వైద్యము, విద్య నేర్పుట, రోగికుపచారము ఇవి ముఖ్యంగా ఆడవాళ్లు చేయదగినవి; బాలికలకు ఈవృత్తులు నేర్పవలె. ఇంకా చేతిపనులను వారికి నేర్పవచ్చు.

(ఞ) ఇందులోను సంఘసేవకుడు ముందు తనయింట నీసంస్కరణలు పాటించవలె. అపిమ్మటనే తోటిసహచరుల దృక్పథము మార్పించ వీలగును.

# 11. ఆరోగ్యబోధ

జనులు ఆరోగ్య సూత్రము లెరిగి కాపాడుటయు ముఖ్యవిషయమే. ఆవిధులు సరిగా సాగిస్తేనే సంఘస్థితి సవ్యంగా ఉండగలదు. అవి లేక జనుల కనేక రోగాలు కల్గుచున్నవి. మనదేశీయులలో చావులు చాల హెచ్చు. అందుకు జనుల దుర్భర దారిద్ర్య మొక ముఖ్యకారణం. నిజమే కాని ఆరోగ్య సూత్రాలు ప్రజలకు బోధిస్తే కొంత క్షోభ తగ్గును. దేహము బాగుంటేనే మనస్సు బాగుండును. ఇది మానవత్వపు మొదటి సూత్రము. మన శరీరాలకు అన్యోన్య సంబంధము తప్పదు. మరియు, మనస్సు బాగుంటే, హింసాభావము పోయి, ఆరోగ్య సూత్రాలు సరిగా గమనింతుము; అంతట వ్యాధులుపోవును కనుక నిర్మాణకార్యక్రమంలో ఈ అంశమును కాంగ్రెసు వారందరూ పాటించవలె.

ఈ ముఖ్య సూత్రాలు గ్రహించుట సులభమే, కాని వాటి ఆచరణలోనే చిక్కు. ముఖ్యసూత్రాలివి: ఎప్పుడూ సద్భావాలే తలపెట్టుడు; అలస బుద్ధి, దురాలోచన మానవలె; దేహము మనస్సులకు పరిశ్రమ సమంగా యుక్తంగా ఉండవలె.

మనము నిల్చుట కూర్చొనుట సరిగా ఉండవలె. వీటిలో మీ నిజప్రవృత్తి విదితం కావలె. తోటి మానవుల సేవించుటకే మనము భుజింపవలె, ఇంద్రియలోలతకు కాదు. దేహమనస్సులను సరియైన స్థితిలో నుంచదగు ఆహారమును తీసుకోవలె. 'యదన్నం తద్భవతి'

మీ ఆహారంవలె నీరు గాలికూడ శుభ్రంగా ఉండవలె. మరియు, ఈ మూడురీతుల శుభ్రత మీ పరిసరాలను అంతటా వ్యాపింపజేయుడు. ‡

— గాంధీజీ

ఈ విషయం 'గ్రామపరిశుద్ధి' సందర్భంలో కొంత చర్చించినాము. దేహము మనస్సు మంచిస్థితిలో నుంచుకొనుట ముఖ్యము. సకాలమైన

---

† శరీర మాద్యంఖలు ధర్మసాధనం (కాళిదాసు)

‡ ఈ సందర్భంలో ఆంధ్రులు ప్రత్యేకంగా గమనింప వలసినవి చాల గలవు. ఇతరు లున్నను గమనింపక చుట్టకాల్చుట, ఉమియుచుండుట, ఇట్టి చర్యలవల్ల పీల్చుగాలియు పరిసరమును చాల అపరిశుభ్రం రోగకరం, అగుట తప్పదు. కాని క్రియలలో చాలమంది యీ సంగతి గమనించుట లేదు.

అభ్యాసములు, ఆరోగ్యకరమై సమమైన ఆహారము, రోజు దేహపరిశ్రమ, నిగ్రహంకల్గి జీవించుట ఇందుకు సాధకములు,

భోజనం, నిద్ర, పని, వేళకనుసరిగ చేయుట, సక్రమపు అభ్యాసముతో నుండుట, చాలనుండికి లేదు. ఒంటికి లేదిమంచిదో చూచుకోకుండ రుచిరైన దని తిందురు|. భుజించుట జీవించుటకే అని మరువకూడదు. బీదలకు అన్ని రకముల సమానంగల ఆహారము దొరకదు. మధ్యవర్గపు వారందుకు బాధపడ నక్కరలేదు. శక్తినిచ్చే తిండి లేక బీదలు జబ్బుపడుదురు; ఎక్కువతిండివల్ల శ్రీమంతులు రోగగ్రస్తులగుదురు. అవసరముకు తగిన ఆహారమునే, తేలికగా తీసుకోవలె. వంట యెంత కొద్దిగా ఉంటే అంత బాగా ఆహారం జీర్ణమగును. బియ్యం పప్పు వగయిరాల పైపొట్టును పోనీయకూడదు. వీటితో శాకము, ఉల్లి, బొప్పాయి, మామిడి, చక్కరకేళి, జామ, టొమాటోవంటి పండ్లును, పాలు, మజ్జిగయు ఆరోగ్యకరములు. ఇవియన్నియు గ్రామాలలో సులభంగా. దొరికేవే.

దేహకృషి సె చేయు శ్రమజీవులకు అక్కరలేదు, కాని మూర్ఖాం మనః పరిశ్రమ చేయువారు • పనిలేనివారు రోజూ సకాలంలో దేహపరిశ్రమ చెయవలె. స్కూళ్లలో కాలేజీలలో విద్యార్థులు వ్యాయామంచేయక,తరుచు ఆరోగ్యం చెడగొట్టుకొనుట తెలిసినదే. ఏదో ఉపయోగించే వస్తువు పుట్టించే పరిశ్రమయే వ్యాయామాలలో ప్రశస్తము. అయితే ఇది అందరికీ సాధ్యం కాకపోవచ్చు* వారివీలుబట్టి కొందరు నడక, ఆరోగ్యమిచ్చేఆటలు యోగాసనములు గూడ, అవలంబించవచ్చు.

సౌమ్యమగు మితాహారము, శుచియగు జీవితము, సకాలపు వ్యాయామము, ఇవి నైతికంగాను ఉపయోగించును. శుభ్రజీవితముకు ఆత్మనిగ్రహము అవసరము. మంచి ఆహారం దేహపరిశ్రమ కల్గినను, ఇంద్రియలోలురై దురభ్యాసపరులైనవా డారోగ్యవంతు డనలేము. మనోనిగ్రహం లేనివాని

† సౌమ్యమై సాత్వికమగు ఆహారమే తినవలె; సాధారణంగా మన ప్రాంతములో పండి సులభంగా దొరికేవానినే భుజింతుము. కనుక మిరప కాయ పొగాకువంటి విదాహివస్తువులపంట మానివేసి, ఆరోగ్యకరమగు వాటినే పండించుట అవసరము. దీని నాంధ్రులు ముఖ్యంగా గమనింపవలె.

* నిదానంగా రోజూ తీరికలో నూలువడికితే స్త్రీలకు పురుషులకు. పరిశ్రమ, వస్తూత్పత్తి గూడ కలుగును

కేంద్రియ నిగ్రహముండదు. మనఃపరిశుద్ధియు కాలవరకు తిను ఆహారమును చేయు పరిశ్రమను సహవాసమును జీవితపద్ధతులను చదువుపుస్తకాలను బట్టియుండును. ఆహారం పరిశ్రమలవలె, సహచరులను వాఙ్మయమును సరిచూచి ఎన్నుకోవలె. మంచి మనోదేహములు కలవారినుండి తోటిజనులకు మంచి భావములు ప్రసరించును. దురభ్యాసపరులవల్ల తోటి వారి పరిసరములును విషపూరితములగును. కనుక జాతీయసేవకులు తోటిజనుల కారోగ్యం, పరిశుద్ధి, సౌఖ్యసంపత్తులు కలిగించవలెనంటే, తాము పరిశుద్ధులు దేహాగ్యులు ఆరోగ్యవంతులుగ నుండవలె

## 12. సామాన్య భాషాప్రచారం

మనదేశమంతట వాడుటకు భారతీయులలోనే హెచ్చుమంది గ్రహించునులభభాష కావలె. ఇది దేశీయంగా ఉండవలె. అది హిందీయే. ఇది ఉత్తర ప్రాంతమంతటా హిందూ ముస్లిములందరూ మాట్లాడేది. ఇదే పారసీలో ఉర్దూ అన బడును. 1925 సం॥ కాన్పూర్లు, సమావేశంలో కాంగ్రెసు వారీ భాషనే "హిందూస్తానీ" అన్నారు. ఈజాతీయ భాషను కాంగ్రెసువారింకను అమలుకు తేలేదు. ప్రజలకు రాజకీయ విద్యను ప్రాంతీయజాతీయ భాషలలోనే నేర్పుటకు 1920 సం॥ నుండి దీక్షతో యత్నించుచున్నారు. వార్షిక కాంగ్రెసులో అ. భా. కాంగ్రెసు కమిటీలోగూడా జాతీయ భాషలో మాట్లాడి వ్యవహరించవలె. కాని, అనేకులింకను అట్లు చేయుట లేదు. కొందరింగ్లీషు నేర్చుకొనుట అందులో మాట్లాడుటయు తప్పనున్నది. ఇది సిగ్గుచేటు. ఇంగ్లీషు ప్రాభవం వదలక దాని మాయలోబడి మనము గమ్యమునకై జరుపు ప్రగతి కడ్డుపడుచున్నాము. ఇంగ్లీషు కన్ని యేండ్లు శ్రమపడుదుమో; అన్ని నెలలలోనే హిందూస్థాని నేర్చుకోవచ్చు. ఆమాత్రం కృషి చేయకపోతే మన ప్రజాభిమాన మనేది వట్టిపైపూతయే అగును.

— గాంధీజీ

చదువు విద్యావంతులమధ్య సమావేశములకు విదేశభాషను పెట్టుటవల్ల మనజాతికెంతైన నష్టమేర్పడినది. చిన్న పిల్లలు పరాయిభాష నేర్చునప్పుడెంతో కష్టపడుదురు. కనుక విషయం కన్న భాషలో ప్రజ్ఞకే విద్యార్థులు కృషి చేయుదురు* మాతృభాషద్వారా చెప్పినప్పుడే విద్య బాగా అబ్బును. కనుక, చదువు, అభిప్రాయ చర్చలు, వ్యవహారాలు ఆయా ప్రాంతాలవాడుక

భాష ద్వారానే జరుగవలె. మరియు ఆయా ప్రాంతాలమధ్యను, జాతీయ విష యాల చర్చలను, ఈమహాదేశంలో సామాన్య భాషకావలె. ఈభాష సుల భంగా అందరూ గ్రహించి నేర్చుకొనేది కావలె. ఉత్తర మధ్య ప్రాంతా లన్నిటిలో చాల మందికి తెలిసిన భాషలోని యీ హిందూస్తానీని చాల మాటలు ఆయా ప్రాంతాలలోను వాడుకలోనున్నవి. ఇది అదృష్టము. ఈ దేశంలో దాదాపు సగంమంది కిప్పటికే తెలిసియుండి చాలవర కితరప్రాం తీయులకు బోధపడుటయు, పదాలుగల హిందూస్తానీ భాషనే మనదేశపు సామాన్యభాషగ గుర్తించినారు అది సహజమే ప్రతిదేశసేవకుడును ఈభాష లోమాటాడ నేర్చుకోవలె. దీనిపేరు తగాదాలతో మనకుపనిలేదు. ఆభాషను దేవనాగరిలోను ఉరుదులోను వ్రాయదగును *

## 13. మాతృ భాషా ప్రేమ

మన మాతృభాషకన్న ఆంగ్లం మీదనే మమతవల్ల, రాజకీయ ధోరణి గల విద్యావంతులకు ప్రజలకు మధ్య విభేదమేర్పడి యున్నది. దేశభాషలు క్షీణించినవి. క్లిష్ట భావాలనూ స్వభాషలో చెప్పలేకున్నాము; వైజ్ఞానిక భావాలకు పదాలులేవు ప్రజలకాధునిక జ్ఞానములేదు. ఇందు వలన హానిమనకు కలుగుట తెలియుటలేదు. ఈ స్థితి మార్పితేగాని ప్రజల బుద్ధి వికసించదు, వారు స్వరాజ్య నిర్మాణముకు సరిగాతోడ్పడలేరు. ప్రతివ్యక్తియు స్వయంగా స్వాతంత్ర్యోద్యమంలోకృషి చేస్తేనే, అహింసాతత్వపు స్వరాజ్యము లభించును. ఇందలి ప్రతిమెట్టూ దాని విశేషమూ సరిగా బోధపడితేనే ప్రజలు దానికై పని చేయుదురు. వీటినన్నిటినీ వారికి మాతృభాషలోనే మనము బోధించవలె. దీనికీ జాతీయభాషా సమస్యకూ పరస్పర సంబంధమున్నది.

ప్రతివారూ స్వాభివృద్ధికి తమ సంస్కృతివికాసమునకు లోపలిభావ ములు తెల్పుటకును మాతృభాషనెప్పుడూ నేర్చుకోవలె. అనువులు స్వభావ వల్లనే సరిగా జరుగును. మన ప్రాంతీయభాషలకు మంచివాఙ్మయమున్నది.

---

* రష్యా అమెరికాసంయుక్త రాజ్యంవంటి మహాదేశాలలోను ప్రాంతీయభాషలెన్నియో వాడుకలోనున్నను ఆదేశపుభాషలలోనొకటియే సామాన్యభాషగ వాడుకలోనున్నది: జాతీయకార్యాలన్నియు ఆభాషలో జరుగును. విజాతీయభాష ఏ పెద్దజాతికిని సామాన్యభాషగలేదు.

అవి వృద్ధియైతే నైతికంగాను ఆధ్యాత్మికంగాను జీవితము బాగు పడును. ప్రాంతీయమగు మాతృభాషకును జాతీయమగు సామాన్యభాషకును సంఘర్షణక్కరలేదు. అవి పరస్పర సహాయములై దేనికర్తవ్యము నది నెర వేర్చును. వాటి సంబంధంవల్ల పరస్పరవృద్ధియే కల్గును. ప్రతివానికీ మాతృ భాషలో ప్రజ్ఞకావలె దక్షిణ ప్రాంతీయులు జాతీయభాషగ హిందుస్తానీ నేర్చుకొన్నట్లే, ఉత్తరప్రాంతీయులు దక్షిణభాషలలో నొకదాని నభ్యసిం చుట మంచిది.

# 14. ఆర్థిక సమత్వపు కృషి

అహింసాయుత స్వాతంత్ర్యము కిదే కీలకం. పెట్టుబడి దార్లకు కార్మి కులకు నిరంతరముండే పోయపోగొట్టి కొద్దిమంది యగు కోటీశ్వరుల దిగ లాగి, కోట్లకొలది బీదలనుద్ధరించి వారిమధ్య సామీప్యమేర్పరుచుటకు ఆర్థిక సమత్వపు కృషియే సాధనం. అప్పుడుగాని అహింసాయుత పాలన మేర్పడదు. ఇప్పటి ఢిల్లీలో వలె, ఇంద్ర భవనాల ప్రక్కనే తిండి లేని కూలి జనుల చుట్టుగుడిసెలుండుట స్వతంత్ర భారతంలో జరుగదు. బీద లకు శ్రీమంతులకు ఒకేరీతి హక్కు. ఇప్పుడీ ధనాఢ్యులు భూస్వాములు తమ ఆస్తివిద్యవల్ల కలిగిన హక్కులు కొన్ని తమంతట వదలి, వాటిని ప్రజాక్షేమ మునకు వినియోగించకపోతే, హింసాయుత క్రాంతి తప్పదు. వారు తమ ఆస్తు లకు ధర్మకర్తలుగానే భాగించుకోవలె ఇది పరిహాసం కాదు. ఇదికష్ట మైనను, అహింసా సిద్ధాంతమే. అట్టిది ఈఉన్నతగిరికి ప్రస్థానమును 1920 సం॥ నుండి ఆరంభించి సాగించుచున్నాము. ఆదేసవ్యమని కార్యకారి అని అనుభవంవల్ల తేలినది. నాయందు అంధ విశ్వాసముంచియు, కేవలం విధేయ బుద్ధితోను కాక దాని సవ్యాపసవ్యతలు పరిశీలించి తృప్తి కల్గిననే అందుకు నడుము కట్టవలె. ఇప్పటి విపరీత వ్యత్యాసాలు పోకతప్పదు కదా! అందుకు హింసా సాధనము ఇంతవరకెక్కడా సరిగా ఫలించలేదు. రష్యాలో ఫలిం చిన దని కొందరందురు; కాని; తొందరగ నిర్ణయింపవీలు లేదు. రష్యాజర్మనీ యుద్ధమయిన తరువాత తుదకెట్లు మారునో తెలియదు. *

మన అహింసా పద్ధతి ఆరంభ స్థితిలో ఉన్నది. ఈపరీక్ష యింకా ఫలించకున్నను. మందంగానే యుక్తమార్గంలో సాగుచున్నది. క్రమ సమ్మతిని జరిగేది కనుక దీని ఫలితము స్థిరంగా ఉండేది. అహింసా పద్ధతిని నిశ్చిత

మైన సంఘమూ జాతియూల అంతటా ఎన్ని ధక్కాలు తగిలినా నిల్చును. మన కాంగ్రెసు సంస్థలోని ధనికులు హృదయ పరిశోధన చేసి, దారి చూపి, ఆఖరి యుద్ధముకు గట్టి పునాదిని వేయవలె. ఈ పెద్ద సంస్కారంలన్నీ స్వరాజ్య మేర్పడిన మీదనే రావలెననుట అహింసా యుద్ధపు ప్రాథమిక సూత్రాలకే వ్యతిరేకం. అది ఆకాశం నుండి ఉట్టిపడేదికాదు అందరి సహకారంతో స్వయంకృషి ద్వారా, మెట్టు మెట్టుగా, నిర్మితం కావలె; ఆ దారిని సాగిపోవుచున్నాము. ఆ స్వరాజ్యపు దృశ్యము నింకను చూచుటకు గోచరము కాదు ఇంకా శ్రమపడి, దూరంవెళ్లవలె అందులో ఆర్థికసమత్వపు సాధనం కావాలె. అందుకు మనమెంత కృషిచేసినామని ప్రతి కాంగ్రెసు వాదియు ప్రశ్నించుకోవలె.

ప్రస్తుతం జనులలో ఆర్థికంగా చాలా విభేదాలున్నవి. కొన్ని రాజ్యాలు తక్కిన వాటికన్న చాల భాగ్యవంతములు; ఒకే దేశంలోకూడా ఆ యా వర్గాల మధ్యవ్యక్తులమధ్య ఎంతో తేడాలున్నవి ఇంగ్లండు అమెరికాలు మన భారతదేశంకన్న ఎన్నోరెట్లు ఐశ్వర్యయుతములు, భారతీయుని పాలినా సగటు రాబడి సుమారు రు 50; ఇంగ్లీషువానిది రు 1,800; అమెరికనుది రు 3,000. అయితే అక్కడను కోటీశ్వరులే గాక, పనిలేక సర్కారునుండి బత్యాలవల్ల ఎట్లో బ్రతుకు కూలీలును గలరు. మహాభవనంప్రక్క బీదల గుడిసెలున్నవి. అయితే మన దేశంలో మేడలకన్న గుడిసెలు చాలరెట్లు హెచ్చు సాధారణంగా యుద్ధాలన్నిటికి (*ముఖ్యంగా ఇప్పటి ప్రచండయుద్ధమునకును) మూలము భూమి సంపాదించుట ఆయాజాతులమధ్య కల్గిన తీవ్రమగు పోటీయే మూలకారణం. ఇప్పటి సాంఘికపద్ధతి జీవిత దృక్పథము ఇట్లేయున్నంతవరకు, ఈపోటీలు యుద్ధాలు ఇట్లే చెలరేగును. శాంతిసౌఖ్యములు స్థిరంగా కావలెనంటే, ఈ ఆర్థికవిభేదాలు పోవలె. యజమానులను హింసించి దౌర్జన్యపుక్రాంతిద్వారా

* ఈ పైమాట వ్రాయునప్పటికి (1941 సం॥ అఖరు) రష్యా జర్మనీలయుద్ధం చాలతీవ్రమై, లోకమందరికి సందిగ్ధ ఫలితంగా ఉండినది. చాల నష్టపడియు రష్యాపూర్తిగ జయమొందినది రష్యాకు తక్కిన మిత్రరాజ్యాలకు మధ్య కొత్త సమస్యలు కల్గినవి యుద్ధానంతరం కొత్త ఆర్థిక సమస్యలుదయించినవి సిద్ధాంతాలలోనేగాక, పారిశ్రామికంగాను తీవ్ర సంఘర్షముదయించు సూచనలున్నవి అంతరంగికంగాను కమ్యూనిస్టుతత్వంలో చాల మార్పులు వచ్చినవి.

ఆర్థికసమత్వం సాధించుటకు కొన్ని ప్రయత్నాలు జరిగినవి. అట్లు సాధించిన సమత్వం ఆ పశుబలంపోతే నిల్చునా అను విషయం ముందు తేలగలదు. అట్లు కాక, అర్జనదాహమును శోషణవృత్తిని తగ్గించుకొని లోపల నిగ్రహంద్వారా సాధించుకొనే సమత్వమే చిరస్థాయికాగలదు. అట్టి దృక్పథం కలుగుటకు ఆయా వ్యక్తుల మనస్సుకు శిక్షణకావలె. ఇట్టిది జాతీయపద్ధతి యంతటను తయారగుట చాలకష్టమే. కాని నిగ్రహము కృషి ఉంటే సాధింపవచ్చు. అది అహింసాయుతసంఘంలోనే కలుగును.

అందరి ప్రకృతి ఒకేరీతిగ నుండదు. బుద్ధి, తెలివితేటలు, కార్యశక్తి కూడ భేదించును. జన్మ, విద్య, ఆస్తివర్గాల తేడావల్ల ప్రకృతికి భిన్నంగా కొందరికి ఎక్కువ సాంఘికసౌకర్యాలు కొందరి కాటంకాలు కలిగి, ఈ విభేదాలు ఇప్పటిసంఘంలో చాలా హెచ్చిపోయినవి, ఈ కృత్రిమపు భేదాలను దౌర్జన్యపద్ధతితో తొలగిననుకొన్నను, అందువల్ల వ్యక్తుల ప్రకృతిని శక్తి ప్రజ్ఞలను సమంచేయలేము. జనులు ప్రతిభను స్వలాభంనిమిత్తంకాక, అందర క్షేమంనిమిత్తంకూడా ఉపయోగించవచ్చు. హింసాతత్వపు సంఘంలో జను డట్టి ప్రజ్ఞను స్వంతలాభంకో, తన పక్షపులాభంకో, తన దేశములాభముకో వినియోగించును. అహింసాయుతసంఘంలోనా? అట్టి శక్తులు సర్వోదయం (అనగా అందరిక్షేమం) నిమిత్తం ఉపయోగింతురు. అట్టి సాంఘికవ్యవస నింకను నిర్మించవలసియున్నది. ఇప్పుడున్న విభేదాలను శాంతిపద్ధతితోనే తొలగించవలె ఈకార్యం సాధించుటెట్లు?

వ్యక్తులే ప్రారంభించి, తమ అహింసాచరణద్వారా ఈ సిద్ధాంతమును వ్యాపింపజేయవలె. ద్రవ్యం బాగా సంపాదించిననే ఆరోగ్యసౌఖ్యములు కలుగునన్న భ్రమ పోవలె. తమ అత్యావశ్యకాలకే. వీలైనంత తక్కువగా సొమ్ము ఖర్చుచేసి, మిగతాసొమ్ము ప్రజాక్షేమం నిమిత్తం ధర్మనిధిగ నుంచుట ప్రతివారి నైతికవిధి. "సౌమ్యజీవనం, ఉదారాశయం" ప్రతివారి నుద్ధరించును. దేశసేవకులందరు సౌమ్యజీవనం శాంతత అభ్యసించితే, అది యితరులకును వ్యాపించును. జన్మను ఆస్తినిబట్టికాక, సత్ప్రవర్తనులు సేవాపరులునే ఆదర పాత్రులు కావలె ప్రభుత్వం వారిట్టి యాదర్శ మములలో పెట్టవలె; ఆర్థికంగా సాంఘికంగాఉండే విభేదము బాధలు తగ్గించే చట్టములను వీలునుబట్టి చేయవలె; అట్టి ఉద్దేశంతో పన్ను వేయు విధానమును మార్చవలె. పూర్తిగా అహింస వ్యాపించిన సంఘంలో సాధారణంగా సర్కారువారిట్లు కల్పించుకొనే అవసరమే యుండదు. మనదేశపు యాజ:

మాన్యం మనకు లభించువరకు ఇందుకు పరస్పరపు సమ్మతితోనే మనము కృషి చేయవలె. పెట్టుబడిదార్లు ఫాక్టరీయజమానులు తమ పనివాళ్ల జీతాలు హెచ్చించి, వారికి ఆరోగ్యమైన ఆహారం వస్త్రం వాసస్థలం ఇట్టి సౌకర్యాలేర్పర్చి కార్మికుల పిల్లలకు విద్య, ఆరోగ్యమిచ్చు విహారస్థలాలు, విజ్ఞానావకాశాలును కల్గింపవలె. తరువాత తమలాభంలో కొంతవాటాను పంచి ఇవ్వదగును; తమ కవసరమైనంతే యుంచుకొని, మిగతాలాభపు సొమ్మును జాతీయ కార్యాలకు నిధగ నీయవలె. జమీందార్లు రయితులకు న్యాయము చేయుచు, న్యాయంగా అవసరమగు తమ ఖర్చులుపోగా మిగులురాబడిని రయితుల క్షేమంనిమిత్తం ఖర్చుచేయవలె ఇట్లే న్యాయవాదులు వైద్యులు వగైరాలు అచరింపవలె. ఇట్లు ధనికులందరు ప్రజాసామాన్యపు క్షేమం నిమిత్తమే (తమ ఖర్చులుపోనుమిగతా) ద్రవ్యమును వినియోగించితే, సంఘంలో ఆర్థిక సమత్వం ఏర్పడుట కారంభించును. అయితే ద్రవ్యవంతులుముందుగా తామును సామాన్యుల మనోభావంకల్గి, తమఖర్చులు తగ్గించుకోవలె.

ఇట్లు 13 అంశాలుకాక పరిశీలింపదగిన మరికొన్ని సంస్థలకు సంబంధిలచినవి, వాటిద్వారా నిర్మాణకార్యమును సాగించవచ్చు.

## 14. అ. భా. కాంగ్రెసు సంస్థ.

స్వాతంత్ర్యసిద్ధికై పోరుటకు ప్రజను సంఘటింపజేయుట అన్నిటిలో ముఖ్యమైన నిర్మాణకార్యము. అందుకే మనకు కాంగ్రెసుసంస్థయున్నది. అట్లే, మరికొన్నిటిని (ఉ॥ రయితులను, కార్మికులను, విద్యార్థులను) సంఘములుగ ఏర్పర్చవచ్చు. ఈసంస్థలు కొంతవరకొకేరీతి పనిచేయవచ్చు. అన్నింటిని అహింసామాత్రంపైనే నడిపితే, వాటిమధ్య సంఘర్షముండదు. అభిప్రాయభేదాలు కలతలుకల్గినను, క్రోధద్రోహాలు లేకుండునట్లు పరిష్కరించవచ్చు. ఈసంస్థలగూర్చి ఇప్పుడు కొంత వివరంగా చర్చింతము.

కాంగ్రెసుసభ్యులలో అన్నివర్గాల మతాల జాతులవారునున్నారు దాని నియమాలకు ఒద్దులైతే, దాని సిద్ధాంతమంగీకరించి సంతకంచేసి పావలా చాలణాలచందా చెల్లించువారెవరైన కాంగ్రెసుసభ్యుడే. అతనిని ఉపసంఘాలకు ఎన్నికపదవులకు ఎన్నుకోవచ్చు. అందుకు వర్గము జాతి మతములకారణమున ఎప్పుడు నిషేధంలేదు కార్యము సేవచేసి తద్వారా కాంగ్రెసువాదుల ఆమోదం సంపాదించుటకు అందులో ప్రతివారికి పూర్తిగా అవకాశమున్నది.

అది ప్రజలు కేవలం తమంతట స్థాపించుసంస్థ, దాని తీర్మానాలను దాని సభ్యులపైన అమలు జరుపుటకు (ప్రజాభిప్రాయం తప్ప) బయటివారి అధికార మేమీ వాడరు. కాంగ్రెసువాదుల సంకల్పనిశ్చయాలే దానిఅమలుకు ముఖ్యాధారాలు. కనుక కాంగ్రెసుసంస్థను నిర్దోషంగాను అనుమానమునకు తావులే కుండాను చేయుట, ప్రతివారి ధర్మము, బాధ్యత. కాంగ్రెసు రిజిష్టరులో దొంగసభ్యుల చేర్పించకూడదు. ఎన్నికలలో అన్యాయపద్ధతు లెంతమాత్రము పెట్టకూడదు. ఈ షరతులన్నియు ఇప్పుడు సరిగా అమలులో లేవు. అట్టిలోపములీసంస్థనుదుర్బలంచేసి, దీని ఉపయోగిత్వం తగ్గించును; కనుక అలోపాలు పోగొట్టుటకు ప్రతి కాంగ్రెసుసభ్యుడు ప్రయత్నించవలె. కాంగ్రెసు సంస్థ, దాని ప్రవృత్తులు, ఉద్దేశాలు, అందరికి వెల్లడియగును. కాంగ్రెసు సభ్యులకు జనసామాన్యముకు ఆసంస్థపై నగల నమ్మకమునబట్టియే కాంగ్రెసుకు బలమేర్పడును. కనుక లంచము, మోసము, ఇట్టివెంతమాత్రం కూడదు. సభ్యులజేర్పించుటలో ఎన్నికలలో దగా కూడదు. సమస్యలు వచ్చినప్పుడు పాక్షికత లేకుండ జాతికుల దృష్టిలేకుండ, నిర్భయంగా న్యాయంగా సవ్యపరిష్కారమే జరుగ తోడ్పడవలె. జనులందరి నమ్మికకు గౌరవమునకు పాత్రమైనంతవరకే కాంగ్రెసు జాతీయసంస్థయై తలెత్తుకోగలదు. ఈ ఉన్నత నీతినుండి కాంగ్రెసు అంతయు (లేక, దాని చిన్న శాఖయైన) తప్పిపోతే, దానిజాతీయత, నైతికఘనత అంతరించి, దానికి ప్రజాక్షేమం కల్గించు శక్తియు చెడును.

# 15. రయితు సంఘాలు

రయితులను రాజకీయాధికార నిమిత్తం వినియోగించుకొనుట కాయా పక్షాలు పోటీపడుట అహింసాసిద్ధాంతముకు వ్యతిరిక్తం. రయితుసంస్థలు సాగించే పద్ధతి చంపారణలో కనబడును. అక్కడ మనదేశంలో ప్రథమ పర్యాయం సత్యాగ్రహమును జయప్రదంగా సాగించే సందర్భంలో ఇదిజరిగినది. అది 20 లక్షలప్రజలకు సంబంధించింది ఆదినుండి అంతంవరకు పూర్తిగా శాంతంగా సాగినది. నూరేండ్లనుండి ఉంటున్న ఒకఅన్యాయ బాధ తొలగింపుకు ఎన్నియో సార్లు హింసా పద్ధతి ప్రయత్నాలు జరిగి, అణచబడి, తుదకి సత్యాగ్రహం ద్వారా 6 నెలలలో విముక్తి అయినది వేరే ప్రత్యేక ప్రయత్నం లేకుండానే చంపారణు జిల్లా రయితులందరికీ దానితో బాగా రాజకీయ చైతన్యము కల్గినది. తమ బాధల నివారణ అహింసాచర్య ఎట్లు

ఉపయోగించినదో వారు ప్రత్యక్షంగా చూచి బీద ప్రజకి దొర ప్రసాదు రాజేంద్ర ప్రసాదు గార్ల నాయకత్వంలో వారు సత్యాగ్రహయుద్ధంలో చక్కగా ప్రవర్తించినారు. ఖేదా (ఖైరా) బార్డోలీ భాగాలలో సాగిన రయితు ఉద్యమాలను గూడ పరిశీలించుడు, రయితుల స్వంత బాధలకని మనము పనిచేస్తే వారు అహింసాతత్వం బోధనలక్కర లేకుండానే కలిసి వస్తారు. అందుకు వారికి బోధపడే చికిత్సకు సిద్ధపడుదురు. తరువాత అదే అహింసా తత్వమును చెప్పితే, గ్రహిస్తారు రాజకీయ ప్రచారానికే వినియోగించుకో బోతే, మాత్రం ప్రయోజనం లేదు. కొందరు కాంగ్రెసు వాదులు రయితులలో సాగించు ప్రచారము వ్యర్థమని హానికల్గించవచ్చునని కూడా నా అభిప్రాయం అది అహింసా పద్ధతి కాదు. అందులో కొందరు అహింసా విశ్వాసులు కారు, వారి చర్యలలో కాంగ్రెసు పేర కాంగ్రెసువాదులుగ వ్యవహరించుట భావ్యం కాదు. 'కిసానులకు కార్మికులకు అఖిల భారతసంఘం నేను పేర్పర్చ లేదు. అందరూ అధోగణినే ఉండవలెనని నా భావమయినను ఇంత మహా దేశంలో అట్లుండుట సాధ్యం కాకపోవచ్చు అహింసలో నిర్బంధ పద్ధతికి స్థానంలేదు. శాంత చర్చవల్ల ఆపని జరుగునని నమ్ముకోవలె

రయితులు, వారిపై సాధారపడువారు, మనదేశ జనులలో నూటికి 85 మంది యున్నారు నిర్మాణ కార్యక్రమమంతయూ వీరికుపయోగించితేనే అది ఫలప్రదమగును. గ్రామపునరుద్ధరణమంతయు ఈ జనులకు, జనాభాలో అంతమందికి హానికరమో సంబంధించనిదో అయితే, అది నిజంగా నిర్మాణాత్మకం గాదు, దాని అంశాలన్నింటిని పూర్తిగా సాగించితే, రయితులకు ఉపకారం జరిగితీరును. ఈదృష్టిని చూచినా, రయితులకు వేరే సంఘము అక్కరలేదు. (రయితులకుతోడై రక్షించకపోతే, కాంగ్రెసు ఇంత బలీయం కాకపోయెడి) కనుక రయితులందరు కాంగ్రెసులో సభ్యులుగ చేరి, దానిని తమ స్వంతసంస్థగ చేసుకోవలె అయితే ఇక రయితులకుపయోగించే కొన్ని సూచనలిత్తును. సర్కారువల్లను భూస్వాములవల్లను పరిహారం పొందవలసిన కొన్ని బాధలు రయితులకున్నవి అందు అత్యవసరమైనవి, స్వరాజ్యంలభించే వరకు ఆగవలసినవి కావు అట్టి బాధలున్నచోట్ల ఆ రయితులతో ఏకీభవించి, పరిహారం పొందుటకు వారికి సాయపడి సలహాలిచ్చుట జాతీయసేవకులందరి కర్తవ్యము శాంతంగా రాయబారాలు జరిపియే, తరుచు అట్టి పరిహారం పొందించవచ్చు. అవియంతయు వ్యర్థమైతే, సత్యాగ్రహము చేయుటకు శిస్తు పన్నులు చెల్లింప నిరాకరించుటకుగూడ రయితులకు హక్కుకలదు. ఎక్కువ-

మందిని బాధించే కష్టమును తొలగించుట ఎక్కువ న్యాయము. ఆయుద్యమమును కేవలం శాంతంగా జరిపితే; అతిత్వరగాను తప్పకను జయమొందును.

రయితులకు మరికొన్ని కష్టములును కలవు వారు తమలో తగవులుపడి కేసులలో చిక్కుకొని, చెడిపోదురు జనుల నమ్మకకు గౌరవమునకు పాత్రుడగు దేశసేవకుడు ఇట్టి తగవులు సౌమ్యంగానే వారిమధ్య పరిష్కరించి, వ్యాజ్యాలు లేకుండ చేయవచ్చు ఇది తరుచు సేద్యదారుకు ఖామందుకు మధ్య గల్గువాటికి కొద్ది తగవులకును మాత్రము వర్తించును. కాంగ్రెసువారు వీరికి సరిగా సాయపడితే వీరు కాంగ్రెసు ఉపయోగమును, నీతిపరతను శక్తిని గమనించి, ఆ సంస్థలో తమంతనే జేరుదురు. అట్టిసంబంధము స్థిరమై, స్వార్థరహితమైయుండును, స్వలాభం నిమిత్తం కాంగ్రెసులో జేరుటో, వారికై ప్రత్యేక సంస్థ స్థాపించుటో కంటె, ఇది యెక్కువ ప్రశస్తము

సమిష్టిగ కలిసి వ్యవసాయ కార్యాలు చేయుపద్ధతి నేర్పితే, రయితుల కెంతో లాభము కల్గును. రయితు భూములు చిన్న-చిన్న ముక్కలుగ విభాగమగుటవల్ల వాటిసేద్యం లాభకరం కాకున్నది. ఇప్పటికి వారసత్వపు చట్టముల బట్టి విభజనను తప్పింప వీలులేదు అయితే కొందరు కలసి కష్టపడి సాగుచేసి, పంటను పంచుకొనుట సాధ్యము, లాభకరము. ఒంటిరయితు చేసుకోలేని వ్యవసాయ పద్ధతులని మెరుగులు సహకార పద్ధతి ద్వారా సాగింపవచ్చు మంచిపశువుల నుంచుకొనుటను ఈపద్ధతి పనికివచ్చును, ఖర్చు తగ్గును. సహకార పద్ధతి పనికివచ్చును, ఖర్చుతగ్గును సహకార పద్ధతి ద్వారా వ్యవసాయంవల్ల రయితుల కెంతో లాభింప వీలున్నది

# 16 కార్మిక సంఘాలు

రయితులు, కార్మికులు విద్యార్థులు, వీరునిర్మాణకార్యం సాగించుటకు స్వరాజ్య సంపాదనకు చాల ముఖ్యులే. స్వాతంత్ర్య యుద్ధంలో వారికిని ముఖ్యస్థానమున్నది కార్మికుల విషయంలో అహమ్మదాబాదు, కార్మికసంఘము అహింసా సిద్ధాంత ప్రకారం నేను నిర్మింప జేసినాను. అది చెడకుండా శాంతంగా దినదినం వృద్ధియగుచున్నది. ఆకార్మిక సంఘంకు [illegible] పిల్లలకు పెద్దవారికి విద్యాలయాలు, ముద్రాలయం ఖాదీ భాండార్ ప్రత్యేక గృహాలు కల్గియున్నవి. దాదాపు అందరూ వోటరులై ఎన్నికలలో అభ్యర్థుల ఎన్నిక నిర్ణయింతురు. (రాష్ట్ర), కాంగ్రెసు సంఘంవారికోరిక పైన

వారికి ఎన్నికహక్కు కల్గినది. అది కాంగ్రెసు కక్షులలో ఎప్పుడూ కల్పించుకోలేదు. అహమ్మదాబాదు పురపాలనను సవ్యస్థితిలో ఉంచును. అహింసా పద్ధతినే సఫలంగా ఎన్నియో సమ్మెలు సాగించినది. అక్కడి మిల్లుదార్లూ, కార్మికులూ తమమధ్య ఎన్నియో సమస్యలు తమంతట పంచాయతీద్వారా పరిష్కరించుకొన్నారు; అది అఖిలభారత ట్రేడుయూనియను కార్మిక కాంగ్రెసు (కార్మికసంస్థ)లో అడ్డు దగులదు, దానివల్ల ఇది పరిభూతం కాలేదు. అహమ్మదాబాదు పద్ధతిని ట్రేడుయూనియనువారు ఆమోదించి ఆసంస్థను అఖిలభారత సంస్థలో చేర్చుకొనే సమయం రావచ్చు. దానికైనా కిప్పుడు తొందర యేమీ లేదు.

కార్ఖానాలలో పనిచేయుకూలీలు "ట్రేడుయూనియను" అను పేర కార్మికసంఘంగా ఏర్పడినారు. సేద్యగాండ్లకన్న వీరిసంఖ్య చాలతక్కువ. కాని పారిశ్రామికనగరాలలో వీరు ఒకేచోట నుందురు; కనుక వీరు కలసి ప్రత్యేకసంస్థయగుట సులభము. వారు తెలివితో తిప్పవలసినయంత్రాలు పనిముట్లు నడుపుదురు, కనుక రయితులకన్న ఎక్కువ తెలివిగలవారందురు. కార్మికుల లాభంనిమిత్తమే వారిని ప్రత్యేకసంస్థగ నేర్పర్చవచ్చు. రయితులవలె, వారికిని నిర్మాణకార్యక్రమం చాలవరకు ఉపయోగకరం; కనుక వీరిలోను దానికి ప్రచారంకావలె.

కార్మికుల వృత్తిపరిస్థితులు సౌకర్యములు బాగుపర్చుటకే కార్మికసమితులు స్థాపించుట మంచిది. వ్యాపారపు యజమాని అన్యాయపరుడై మొండితనంగావుంటే సమ్మెపద్ధతి కావలసినదే. కాని న్యాయం సాధించుటకు తక్కిన ప్రయత్నాలన్నియు జరిగి, అవి వ్యర్థమయితేనే, సమ్మెకు పూనవలె. కార్మికులకు మంచి సేవకులసలహా చాల అవసరం.

## 17. విద్యార్థి సంఘాలు

విద్యార్థులకూ నాకు ఎప్పుడూ సంపర్కమున్నది. వారు నాకు తోడ్పడినారు; నాసహాధ్యాయులనేకులు నా సహకర్తలయినారు. అసహకారపు ఉద్యమ మధ్యంలో ఎందరో బడులువదలిరి. కొందరు విద్యార్థులు ఆచార్యులు తుదివరకునిల్చి దేశమునకు తమకు చాలా ఉపయోగించినారు. తరువాత వాతావరణంలేదు ఇప్పటి విద్యాపద్ధతి కృత్రిమమేఅయినను, ఉద్యోగకాంక్షవల్ల నాగరికసంఘంలో స్థానంకొరకు న్యాయమైన జ్ఞానపిపాసవల్లను

గూడ, విద్యార్థులలో జేరుచున్నారు. మాతృభాషస్థానే నట్టి విదేశభాష నేర్పుట వేలకొలది అమూల్యకాలము ఖర్చగుచున్నదని సంకోచములేదు. ఆధునిక విజ్ఞానశాస్త్రముల నేర్పుటకు మన దేశభాషలు వ్యర్థమనియే వారు వారి బోధకులుగూడ భావింతురు మరి, జపానువారు స్వభాషలోనే విద్య నేర్పుచున్నట్లున్నది. చీనానాయకుని (చంగ్ కై షేక్) కాని ఇంగ్లీషుజ్ఞానమత్యల్పం.

కాని, ఇట్టి మన విద్యార్థుల నుండియే ముందుతరపు జాతీయ నాయకు లేర్పడవలె. వారిమీద అందరి ఆకర్షణలో ప్రసరించినది అహింస వారికి నచ్చుటలేదు. దెబ్బకు దెబ్బ, లేదా, ఒకటికి రెండు అంటే చప్పున ఎక్కుతుంది; తాత్కాలికమైనా, సద్యఃఫలితముండును. ఇట్టి పశుబల సంఘర్షణ సర్వత్ర, మనయెదుట అనంతంగా సాగుతూనే ఉన్నది. ఓపికతో శోధించి ఇంకా ఓపికతో కష్టంతో ఆచరిస్తేనే అహింసా తత్వము బోధపడును. రయితులను కార్మికులవలె విద్యార్థులనుకూడా ఆ కారణంవల్లనే ఆకర్షింప యత్నించలేదు. కాని, నేనూ వారితో విద్యార్థినే అయితేనా విశ్వవిద్యాలయం వేరు. నాదారిలోకివచ్చి పరిశోధన సాగించుమని నేను కోరుతూనే ఉన్నాను. నా షరతులివిగో: —

విద్యార్థులు రాజకీయ కక్షలలో పాల్గొనకూడదు. వారు విద్యార్థులు శోధకులలే గాని రాజకీయపరులు కారు.

రాజకీయ సమ్మెలలో వారు చేరకూడదు. కొందరు వీరులను మెచ్చుకోవలె కాని బంధితులైనా మరణించినా ఉరితీయబడినాకూడా సమ్మెలు కట్టకూడదు. వారిలోని ఘనతను తమ జీవితంలో అనుకరించియే తమ భక్తిని చూపవలె. ఆవీరులు బంధింపబడినా, మరణించినా, ఉరితీయబడినా సరే సమ్మెలుకట్టకూడదు; దుఃఖంపట్టలేకపోతే, విద్యార్థులందరికీ అభావముంటే తమ పాఠశాల అధ్యక్షులు సమ్మతిపొంది, వాటినారోజు కట్టించుకోవలె. వారొప్పుకోకపోతే, శాంతంగా గానీ మర్యాదగా గానీ బయటకు పోవచ్చు; కాని, విద్యార్థులనుగాని యజమానులనుగాని ఎప్పుడూ నిర్బంధించకూడదు; తామైకమత్యంగల్గి మర్యాదగా వర్తిస్తే జయములభించునని నమ్మవలె.

వారందరూ శాస్త్రీయంగా యజ్ఞార్థం నూలు వడుకుచుండవలె; తమ పరికరాలను శుభ్రంగా మంచిస్థితిలో ఉంచుకోవలె. వాటిని వీలైతే తామే చేసుకోవలె నూలు ప్రశస్తంగా ఉండవలె వడుకుటగూడ ఆర్థిక, సాంఘిక నైతిక రాజకీయాలుగా ఉండేవిశేషాలు తెలిపే వాఙ్మయమంతా అభ్యసించవలె.

వారెప్పుడూ ఖాదీధరిస్తే విదేశీయాంత్రికవస్తువులకు బదులు గ్రామవస్తువులనే ఉపయోగించవలె.

'వందేమాతరం' గాని జాతీయజెండాగాని ఇష్టంలేని ఇతరులపై దూషించకూడదు. ఆజెండా బొత్తాలులో వేసుకోవచ్చు: ఇతరులనందుకు నిర్బంధించకూడదు.

త్రివర్ణపతాకపు సందేశం గ్రహింపవచ్చు. కులతత్వంగాని అంటరానితనంగాని మనస్సులో పెట్టుకోకూడదు. హరిజనులతోను అన్యమత విద్యార్థులతోను మైత్రిగల్గి, బంధువులవలె మెలగవలె.

గాయపడిన తోటివారికి చికిత్స, దొడ్డిశుద్ధి పక్కగ్రామాలుశుభ్రం జరిగించవలె, యిందుకు గ్రామంలో పిల్లలకు పెద్దలకు బోధించవలె.

జాతీయభాష హిందూస్తానీని హిందీ ఉర్దూల రెండు రూపాలలో నేర్చి, మాట్లాడగల్గియుండవలె.

తాము నేర్చుకొనే క్రొత్తవిషయాలను స్వభాషలలో తర్జుమాచేసి, ఆసంగతులు చుట్టు గ్రామాల జనులకు కాలాంతములో వెళ్లి బోధించుచుండవలె.

రహస్య చర్యలేవీ చేయక సత్యంగా సంచరిస్తు, నిగ్రహంగల్గి, నిర్భీకులై దుర్బలురగు తోటివిద్యార్థులను రక్షింపసిద్ధులై, దొమ్మీకలిగితే, ప్రాణమర్పించైనా అహింసతో శాంతిసమకూర్పు పూనవలె. యుద్ధముకు అంత్యసమయం వచ్చినప్పుడు, తమ స్కూళ్లువదలి అవసరమైతే స్వదేశంనిమిత్తం పూర్ణత్యాగం చేయవలె.

తోటి విద్యార్థినుల విషయమై సరిగా న్యాయంగా సంచరించవలె.

ప్రస్తుతంవలె కాలంవ్యర్థపరుపక, పొదుపుతో రోజూ కొన్నిగంటలు మిగిల్చి పై కార్యక్రమమును వినియోగించవలె, అట్లు వీలుకాకపోతే, దేశభక్తులగు విద్యార్థులు ఒకయేడాది చదువుమాని ఆకాలమందును వుపయోగించవలె. ఆ అనుభవము వ్యర్థంగాపోదు. ఇందువల్ల నీతి మన శరీరాలన్నింటిలో శక్తియుతులై, విద్యార్థికాలంలోనే వారు స్వాతంత్ర్యోద్యమమును బాగా సాయపడిన వారగుదురు.

ఈ 13† అంశాల కార్యక్రమములు యే స్వరాజ్యమునకు అవసరమో దానినెట్లు సాగించవలెనో చూపియున్నాను. ఇందులో ఇంకా అంశాలుండ వచ్చు, స్వరాజ్యము మహాభవనం కనుక 30 కోట్ల చేతులకూ పనియుంటుంది అట్టిచో కొన్ని అంశాలుంటవి. అయితే అన్నిటికీ కేంద్రగృహం చరఖా, తక్కినవి దానిచుట్టునుండును. చరఖావల్ల నిరంతర నిర్మాణ సేవకుత్సాహం, జనించును.

కృషి చేయవలసిన ముఖ్యసంఘాలలో నొకటి విద్యార్థి బృందము. కాని ఈపవిత్రత్వంవేరు విద్యార్థుల సంఘం మరొకవర్గంతో సంఘర్షణ కలిగే ప్రత్యేకవర్గంకాదు కనుక వారి హక్కుల రక్షణకని నిజంగా ప్రత్యేక సంఘప్రస్తావన అవసరంకాదు. తమకొప్పగించిన యువకులను భౌతికంగా, మానసికంగా, నైతికంగాను, యోగ్యులై ఆరోగ్యవంతులగు పౌరులుగ తయారు చేయుటకే, విద్యాధికారులు ప్రజోద్యోగులుగ నుండవలె. కనుక రయితుసంఘం కార్మికసంఘం పద్ధతిని, విద్యార్థిసంఘాలు స్థాపించుట అనవసరమే కాని, ఇప్పటి మనస్థితిలో విద్యాశాఖాధికారులు నిజమైన సంఘసేవకులరీతిగ లేరు వారు సర్కారు ఉద్యోగులు; సర్కారు ఉద్దేశము దేశీయుల ఉద్దేశము భేదించుచున్నవి. బ్రిటిషు ప్రభుత్వంవారు ఒక ప్రత్యేకోద్దేశంతోనే ఇప్పటి విద్యను నేర్పుచున్నారు కనుక జాతీయాశయాలతో ప్రేరితులైన విద్యార్థులకూ జాతీయ వ్యతిరేకులగు సర్కారుకు విధేయులగు ఉపాధ్యాయులకూ మధ్య సంఘర్షము జనించును. విద్యనిమిత్తం పిమ్మట జీవితవృత్తి నిమిత్తం ప్రభుత్వంపైన ఆధారపడునంతవరకు దానిసోపారికి రెండువిధాలా హానియే. విద్యార్థులు తమకిప్పుడు విద్యాసంస్థలలో లభించు విద్యలోనిలోపం పోగొట్టి అలోటుతీర్చుకొనుటకే విద్యార్థి సంఘాలేర్పరచుకోవలె, తమ్మును ప్రజ్ఞావంతులగు పౌరులుగ జేయుటకే పనిచేయవలె. స్వాతంత్ర్యోద్యమములో విద్యార్థులు చేయదగినపని కలదు. ఇప్పటి యుద్ధంలో పాల్గొనక, ఇకముందు తాము యుద్ధంలో పాల్గొనతయారగుటకై వారు వృత్తాంతాలను విశేషాలను గ్రహించుచుండవలె. ఇప్పుడే సాహసించువారు సర్కారు విద్యాసంస్థలనుండి తెంచుకొనివచ్చి, ఇప్పుడే దేశసేవ

---

† ఇటీవల గాంధిమహాత్ముడు మరిరెండు అంశాలు చేర్చి 15 గా చేసెను అందొకటి అనగా 14 వది ఆదిజనుల ఉద్ధరణ వీరి సమస్య చాల వరకు హరిజనుల అస్పృశ్యత సమస్య వంటిది 15వది రయితు కార్మిక, విద్యార్థి సంఘములకు సంబంధించినది.

చేయవచ్చు, సరే. కాని, అప్పుడు వారు విద్యార్థిసంఘంలో సభ్యులుగ ఉండరు. అయితే, ఇప్పుడు, తక్కినవారివలె విద్యార్థులును నిర్మాణ కార్యక్రమం సాగింపవచ్చు అందులో పైన చెప్పిన చాలా అంశాలను చక్కగా సాగింపవచ్చు. మీరు సంఘసంస్కరణకును తోడ్పడవచ్చు. స్వంతకుటుంబాలలో స్త్రీలయుద్ధరణకు సాయపడవచ్చు మీ జీవితములు సౌమ్యముగ చేసుకొండు; సెలవులలో కొంత గ్రామసేవ చేయుడు; నిర్మాణ కార్యపు అన్ని అంశాలలో కృషి చేయుచున్నను, విద్యార్థులు అధికారులతోను తల్లి తండ్రులతోను సంఘర్షణ పడనక్కరలేదు. సరికదా, కార్యంలో ప్రత్యక్షానుభవం పరిచయం కల్గి మంచి అవకాశాలు గల్గి భావిపౌరజీవితంలో ఎంతో సహకారిగనుండుటవల్ల, తరువాత స్వతంత్ర దేశపువారివలె, జీవిత సమస్యలెన్నిటినో సులభంగా పరిష్కరించుకొనవీలగును. విద్యార్థి సంఘాల నీపద్ధతులలో స్థాపించి వారిలో ఐకమత్యము వృద్ధిచేయును. విద్యార్థి లోకపు ప్రేమను విశ్వాసమును చూరగొని, ఇప్పుడు లోపించిన క్రమశిక్షణను ఐకమత్యమును వారికి కల్గించు శ్రద్ధగల జాతీయసేవకులు కావలె దేశసేవకులు ప్రకం గుణబిప్రాయంలేకుండ స్వార్థరహితులై యుండవలె తాత్కాలికోత్సాహంలో కొట్టుకపోవుట, నిరుత్సాహంవల్ల క్రుంగిపోవుటయు లేకుండ, నమ్మకతోను విశ్వాసంతోను యువకులతత్వం గ్రహించియు, కృషి చేయవలె.

## ముగింపు

ఏసంఘంవారైనను, ప్రతిభారతీయుడును తనమాతృదేశమునకుస్వాతంత్ర్యం కావలెనని కోరును. ఈ కార్యక్రమంలోని ఏఅంశమును తగాదాకు ఆస్పదం కాదు. ఇదిసర్వవ్యాపి, జీవితరంగములన్నిటినీ తనలో చేర్చుకొన్నది. మనలో చాల గొప్పవారు, చాలతక్కువవారుకూడ, ఈకార్యక్రమంద్వారా, కృషిచేసి, ఆత్మవికాసము పొందవచ్చు, ఇది అందరికీ వర్తించును. నిజంగా ఇందులో స్త్రీ లెంతైన పనిచేయవచ్చు, దీనికై అందరూ ఉత్సాహంతోను బుద్ధి విశ్వాసాలతోను కార్యతూరత్వంతోను పనిచేయుదురు గాక, తద్వారా మన భారతభూమికి సాధ్యమైనంత త్వరలో స్వాతంత్ర్యం సిద్ధించు గాక!

# సత్యాగ్రహ స్థానం

నిర్మాణకార్యక్రమంలో ప్రజలందరూ సాయపడితే అహింసాపద్ధతిని స్వరాజ్యం లభించుటకు శాసనధిక్కారమవసరమేకాదు; అయితే అంతటి అదృష్టం లభించుట కష్టం. కనుక జాతీయమగు అహింసా కృషిలో సత్యాగ్రహప్రస్థానంకూడ తెలుపుదును.

1 ఒకప్రాంతీయపుఅన్యాయం పోగొట్టుకొనుటకు దానినిజయప్రదంగా సాగించవచ్చు.

2. ఒక అన్యాయనివృత్తికని, ఫలితమెట్లున్నా, అక్కడిజనుల అంతఃకరణను పురికొల్పుటకును అది ఉపయోగించును. ఫలించదని ప్రజలు శ్రద్ధతీసుకోకమా అని తోచిన చంపారణంలో సత్యాగ్రహమునట్లే ఆరంభించితిని అది సఫలమగుట ఈశ్వరకృపవలె (లేదా అదృష్టంఅనుకోండి)

నిర్మాణకార్యమందరూ సాగింపపోయినా సత్యాగ్రహం సాగించవచ్చు. స్వాతంత్ర్యయుద్ధంలో భాగమయినా, వాస్వాతంత్ర్యంవంటి సామాన్యప్రశ్నకాదు. ఆసమస్య స్పష్టమై, ఎదురుపార్టీ వారు మనకీయ వీలుగాఉండవలె, ఇది సరిగాసాగిస్తే ఆత్మత్యాగము చేకూరును.

సత్యాగ్రహ విశేషం పూర్తిగా చెప్పలేదు గాని ఈ చెప్పినదానినిబట్టి నిర్మాణకార్యక్రమమునకూ సత్యాగ్రహమునకూ గల అన్యోన్యసంబంధం తెలియును. పైనచెప్పిన మొదటి రెండుసందర్భాలలో నిర్మాణకార్యముకు విశేషయత్నం మక్కరలేదు. కాని స్వరాజ్య సంపాదన సత్యాగ్రహం సాగించే యోధుల ముఖ్యుడు కావలెను. జనులందుకు కృషిచేయవలె, సత్యాగ్రహములు యోధులకు ప్రోద్బలమూ ప్రత్యర్థికి అనగా ఇక్కడ అధికార వర్గమునకు సవాలు కల్గును. నిర్మాణ కార్యరూపంగా లక్షలు కోట్లు జనులు తోట్పడకుండా స్వాతంత్ర్యపు సత్యాగ్రహం సాగించుటనేది వట్టి బడాయీ యనికూడ చాలినది అగును.

★

## ఉపసంహారం

కాంగ్రెసు తరఫున గాని, వారి కార్యకర్తల కోరిక పైన సేవాగ్రామంలో కొందరు సహచరులతో కలిగిన సంభాషణ ఫలితంగా దీనిని వ్రాసినాను. సత్యాగ్రహంతో నిర్మాణ కార్యక్రమపు విధానమును గూర్చి నేను స్వయంగా వ్రాయవలెనని వారన్నందున దానిని వివరంలేకుండా దాని నాచరించు విధం తెలుపు నాలోచనలతో వ్రాసినాను.

ఈ అంశాలను స్వాతంత్ర్యోద్యమ భాగముగను అనిపరిహసించకుడు. అహింసలో స్వాతంత్ర్యంతో కలపకుండా ఎందరో ఎన్నో పనులు చేయవచ్చు. దానికాఫలముండును సామాన్యుడైన వాడే తరువాత సేనానాయకుడైన నప్పుడు లక్షలాది జనుల ప్రాణాలు చేతబెట్టుకోగలడు. అట్లే రాటము బీద వితంతువుకు కానీ సంపాదనకు కారణమైతే, జవహర్లాలు చేతిలో అదే భారత స్వాతంత్ర్య సాధనమగును. స్థానమును బట్టి గౌరవము కల్గును. నిర్మాణ కార్యక్రమపు ఉన్నత స్థానమును బట్టి దానికి పేరు గౌరవము కల్గును ఇది మీకు రుచించకపోతే నన్ను తప్పించవలెను. నాకు నిర్మాణ కార్యక్రమము లేకుండా సత్యాగ్రహం పాటించుట అనగా పక్షవాతంతో ఉన్న చేతితో చంచాను ఎత్తుటగా ఉండును.

★

అర్హులుకారు. ఉపాధ్యాయులైన కాంగ్రెసువారి సూచనలబట్టి తమ కార్యక్రమం నిర్ణయించుకోవచ్చు †

మనదేశంలో నూటికిపదిమందిమాత్రమే అక్షరాస్యులు. ఇదియెంతఘోరమో! వీరిలోనుకొందరే బాగా చదువువారు † కనుక నూటికి 95 మందివిద్యావిహీనులన్నమాట, కొందరు చదువుకోనివారును జ్ఞానులు కావచ్చు, నిజమే, కాని, చదువు వ్రాత నేర్చినవారు మనస్సు బాగావికసించి, ఇతరులభావాలు గ్రహింపగల్గుదురుగదా! 'వయోజనవిద్య' అనగా వ్రాతమాత్రం నేర్పుటకాదు ఇంకా చాలజ్ఞానానుభవములిచ్చే సామాన్యవిద్యనుగూడ ఇందులో చేర్చవలె.

ప్రతి ప్రజాసేవకుడు తనప్రాంతంలో నిరక్షరతను పోగొట్టుటకుపూనుకోవలె. నడివయస్సుగల పెద్దవారికి విద్య నేర్పుటకు సాయంకాలమే బహుశః ఎక్కువవీలగును. అందుకు దీపములు కావలె; పుస్తకాలక్కరలేదు; కర్రచెక్కయో (పూర్వకాలంలోవలె) మట్టిపలకయో పెట్టి, బొగ్గుతో వ్రాయవచ్చు కొంచం సుద్దకూడా వుంటేచాలు, వీటితో కొద్దికాలంలోనే అక్షరవిద్య నేర్పవచ్చు. ఇందు కుపయోగించే అంశములు తెల్పుపట్టీలున్నవి; వాటిని కొద్దివెలకే కొనుక్కోవచ్చు, అవిలేకున్నను కార్యపరుల శ్రద్ధ ఉత్సాహములే ముఖ్యములు సహకారపద్ధతి బాగా పనిచేయును. కొందరు పెద్దవయస్సువారు చదువుకోగానే, చిన్నగ్రంథాలయంకూడా పెట్టి, మంచిపుస్తకాలును ఒక దినపత్రికకూడా తెప్పించవలె.

నోటితో నేచాల విజ్ఞానము నేర్పవచ్చు. పూర్వంహిందువులు పురాణాలుమతగ్రంథాలు చదివి వినిపించేవారు, ఇట్లే ముస్లిములును "మిలాద్‌షరీఫ్" సాగించేవారు; ఇవి ఉపయోగించేవి. కథలు ప్రవచనాలు, సంకీర్తనలు, మిలాదులు, వగయిరాలద్వారా జనులకు మతజ్ఞానమబ్బును చరిత్ర, ప్రకృతి విజ్ఞానం, లోకవ్యవహారాలు, ఇట్టివాటిని నోటితోను చదువు కూటములద్వారాను నేర్పవచ్చు. ఐతే ఈకార్యపరులు ముందుగా సరిగా విషయాలు తెలుసుకోవలె వయోజనవిద్యద్వారా పౌరస్వత్వమును సమిష్టినిర్వాహణపద్ధతులను జనులకు నేర్పవచ్చు వీలున్నది. ఈరెండును గ్రామపునర్నిర్మాణముకు ముఖ్యములు.

† 1941 సం॥రపు కొత్తజనాభా లెక్క ప్రకారం నూటికి పదిమంది అక్షరాస్యులట; తక్కిన నాగరికదేశాలలో నూటికి 95 మంది చదువుకొన్నవారు. 'విద్యావిహీనః పశుః; జ్ఞానేన హీనః పశుభిస్సమానః' అని పూర్వికులు విద్యాభ్యాసపు ఆవశ్యకతను తెల్పినారు.